# సూక్తిరత్నావళి

వివిధ సంస్కృత గ్రంథముల నుండి
సేకరించిన ఉత్తమ శ్లోకముల సంపుటి
తెలుగు అర్థములతో

సంకలనము, అర్థవివరణ
పి. వి. రామానుజ స్వామి, ఎమ్. ఎ.

గుండిమెడాస్
పవరుపేట : ఏలూరు

First Edition 5,000 copies
September, 1959

# SOOKTI RATNAVALI

*(Anthology of Sanskrit Verses)*

*Compiled by*

*Sri P. V. Ramanuja Swamy M. A.*

*Retired Director of Sri Venkateswara Oriental Research Institute:*

Published under the auspices of
The Southern Languages Book Trust

TELUGU 39

Price Rs. 0-80 nP.

Published by
GUNDIMEDAS
Powerpet : Eluru

Printed at Pattabhirama Press, Eluru.

# పరిచయము

ప్రజాసామాన్యానికి ఆకర్షకంగా, విశేషోపయోగకరంగా ఉండే పుస్తకాల ప్రచురణకు దోహదం చెయ్యాలనే సంకల్పంతో దక్షిణభారత పుస్తక సంస్థ లోగడ కొన్ని పుస్తకాలను ప్రచురింపజేసింది. ఆ ప్రచురణల వలన కలిగిన అనుభవంతో ఇప్పుడు మరికొన్ని పుస్తకాలను వివిధ ద్రావిడ భాషలలోనికి అనువాదం చేయించి ప్రచురింప జేస్తూంది. పాఠకులలో భిన్న భిన్న అభిరుచులకు తగినట్లు పుస్తకాలను శ్రద్ధగా ఎన్నిక చేశారు. అందు వల్ల, మానవ జీవితానికి సంబంధించిన వివిధ విషయాలను గురించిన రచనలు ఇందులో ఉండటం సహజం. భారత మహానాయకుల జీవిత చరిత్రలు, వారు చేసిన ఘన కార్యాలు వివరించే గ్రంథాలు ఈ ద్వితీయ గ్రంథ పరంపరలో ఒక శాఖ. మన దేశ శ్రేయస్సుకోసం, అభ్యుదయం కోసం ఆ మహా పురుషులు ఏమిచేసినది, వారికి తామెంత ఋణపడిఉన్నది, ప్రజలకు ముఖ్యావశ్యకములైన హక్కులను సంపాదించడానికి వారె న్నెన్ని పాట్లు పడినది ముందు తరాల వారంతా తెలుసుకుని ఉండటం మంచిది.

తత్త్వశాస్త్రం, మతం, విజ్ఞాన శాస్త్రం, సాహిత్యం - ఈ గ్రంథ పరంపరలోని ఇతర శాఖలు. కథానికలు, ప్రాచీన కళా సంపదలను అభి వర్ణించే గ్రంథాలు కూడా ఇందులో ఉండటం ముదావహం. నాటకకళ, శిల్పశాస్త్రం, పురావస్తు పరిశోధనలు, నిరతాద్భుతావహములైన దాక్షి ణాత్య దేవాలయాలను గురించిన గ్రంథాలు ఈ పరంపరలో ఉన్నవి. విజ్ఞాన వికాస దాయకములైన భిన్నభిన్న విషయాలను గురించిన ఈ గ్రంథాలు ప్రజలను విశేషంగా ఆకర్షింపగలవని, ఆ విధంగా ఇట్టి ప్రచు రణలకు ముందుముందు విస్తార ప్రచారం కలుగగలదని నా విశ్వాసం.

దక్షిణ భారత భాషలలోని ఉత్తమ గ్రంథాలు కొన్నింటిని మిగిలిన దాక్షిణాత్య భాషలలోకి అనువదింపజేయటం ఈ ద్వితీయ గ్రంథపరంపరలోని మరొక ప్రశంసనీయమైన విశేషం. ఈ పుస్తకాలన్నీ పూర్తిగా వెలువడినప్పుడు విద్యావంతులలో ఎక్కువమందిని వివిధవిషయాలను గురించిన జ్ఞానాసక్తి గల పాఠకులుగా ఆకర్షించి, ఆ జ్ఞాన పిపాసను తృప్తిపరచడానికి యోగ్యమైన గ్రంథాలనుకూడా వారికి అందజేసినట్లు అవుతుంది.

ఈ దక్షిణ భాషా పుస్తకసంస్థ ఆశయాలు శీఘ్రగతిని సఫలము కాగలవని ఆశిస్తున్నాను.

మద్రాసు,
7 వ అక్టోబరు, 1958

ఇట్లు,
ఎ. లక్ష్మణస్వామి ముదలియార్
వైస్‌ఛాన్సెలర్
మద్రాసు విశ్వవిద్యాలయం

# తొలిపలుకు

ప్రతి మతము ధర్మములను, నీతి సూత్రములను బోధించును. హైందవ మతము గూడ ఈ విషయమున అన్య మతములకు దీసిపోవునది కాదు. కాకపోగా, ఇందీ మత మితర మతము లన్నింటి నతిశయించుట ఇందలి లోప మనినను అన వచ్చును. మానవ జీవితమున మత ప్రయోజన మెట్టి దనినను, విజయవంతమైన సుఖజీవనమునకు ధర్మబద్ధత, నీతినియమములు అత్యంతావశ్యకములు. మానవ జీవన సత్యములను సంగ్రహముగ, సునిశితముగ, సుబోధకముగ వివరించుచు, మనోహరోపమానములతో వాటికి మెరుగువెట్టు చిన్న చిన్న శ్లోకములు సంస్కృత వాఙ్మయమున బుష్కలముగ నున్నవి. శాబ్దిక ఆర్థిక సౌందర్య శోభితము, సమర్థము అయిన సంస్కృతభాష ఎంత ఉదాత్తకవి భావననైన చక్కగ వ్యక్తీకరించుటకు సమర్థము.

ఈ భావముతో, సంస్కృత వాఙ్మయములో నైతిక ధర్మములను దెలుపు మనోహర శ్లోకములను సుమారు రెండు వందలవరకు వివిధోద్గ్రంథములనుండి ఏర్చి, కూర్చి, ఆ శ్లోకములను అనువాద సహితముగ తెలుగు, తమిళ, కన్నడ, మళయాళ భాషలలో ప్రకటించుటకు దక్షిణ భాషా పుస్తక సంస్థ చేయుచున్న ప్రయత్న మెంతయు శ్లాఘ్యము.

సంస్కృత భాషలో వివిధ మహాకవుల రచనల నుండి ఎన్నిక చేసి ప్రకటించిన ఉత్తమ శ్లోక సంకలనములు చాల ఉన్నవి. అందు కొన్నిటి యందు విషయ విభజనముగూడ జేయబడినది. మహాభారతము నుండి ఉద్ధృతమై, బ్రాహ్మణ మత్రసారమని చెప్పదగిన భగవద్గీత నీతిమంతమైన నడవడి కను నిర్దేశించు గ్రంథములలో కెల్ల ఉత్తమోత్తమ మైనది. ఈ గ్రంథమందలి శ్లోకములు అట్టి బహు గ్రంథముల నుండి సంపాదితములు.

ఇట్టి సుభాషిత సంకలన గ్రంథము లు పాఠకుల మాన సములలో సముచిత ధర్మానురక్తికిని, నైతిక జీవనాసక్తికిని దోహదకారులు కాగలవని విశ్వసించుచున్నాను.

విశాఖపట్టణము,
ఉగాది,
9 వ ఏప్రిల్. 1959,

పి. వి. రామానుజస్వామి,
తిరుపతి సంస్కృత కళాశాల
పూర్వాధ్యక్షులు.

## త్యాగము

త్యాగ ఏకో గుణః శ్లాఘ్యః కిమన్యైర్గుణరాశిభిః ।
త్యాగాజ్జగతి పూజ్యన్తే పశు పాషాణ పాదపాః॥

త్యాగము ఒకటే శ్లాఘ్యమైనది. మిగిలిన గుణసమూహాముల వలన ప్రయోజనము లేదు. జంతువులు, పాషాణములు, వృక్షములును త్యాగమువలన జగమునందు పూజింపబడుచున్నవి.

## 2 దానము

దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం విదుః ॥

మంచిప్రదేశమున, తగు సమయమునందు, దానము పొందు నర్హత గలవానికి, అనుపకారికి, దానము చేయవలెనను భావముతో చేయబడు దానమును సాత్త్వికదానమని చెప్పుదురు.

## 3 లోభము

మాతరం పితరం పుత్రం భ్రాతరం వా సుహృత్తమమ్।
లోభావిష్టో నరో హన్తి స్వామినం వా సహోదరమ్॥

లోభముచే ఆవేశించబడిన మనుష్యుడు తల్లిదండ్రులను, పుత్త్రిని, సహోదరుని, ప్రాణమిత్రుని, యజమానిని (గూడ) చంపును.

### 4 ఔదార్యము

అయం నిజః పరోవేతి గణనా లఘుచేతసామ్।
ఉదారచరితానాం తు వసుధైవ కుటుంబకమ్॥

ఇతడు మనవాడా లేక పరుడా యను తలంపు సంకుచిత మనస్సు కలవారికే కలుగుచుండును. ఉదార స్వభావము గలవారికి లోక మంతయు తమ కుటుంబమే.

### 5 పరోపకారము

ఆత్మార్థం జీవలోకేఽస్మిన్ కో న జీవతి మానవః ।
పరం పరోపకారార్థం యో జీవతి స జీవతి॥

ఈ జీవలోకమున ఏమానవుడు తన కొరకు జీవించుట లేదు? కాని, పరోపకారము కొరకు ఎవడు జీవించునో వాడే నిజముగా జీవించువాడు.

### 6 పరోపకారము

శ్రోత్రం శ్రుతేనైవ న కుండలేన దానేన పాణి ర్న తు కంకణేన।
విభాతి కాయః ఖలు సజ్జనానాం పరోపకారేణ న చందనేన॥

సజ్జనులకు చెవి విద్యను వినుటచే శోభించును కాని, కుండలములచేతను కాదు. చేయి దానమిచ్చుటచే(శోభించును), కాని కంకణము చేతను కాదు. శరీరము పరోపకారము చేతనే (శోభించును) కాని చందనము చేత కాదు.

### 7 గుణము

శరీరస్య గుణానాం చ దూర మత్యన్త మన్తరమ్ ।
శరీరం క్షణ విధ్వంసి కల్పాంత స్థాయినో గుణాః ॥

శరీరమునకును, గుణములకును విశేషభేదము కలదు. శరీరము క్షణములో నశించును. గుణములు కల్పాంతము వరకును నిలిచి యుండును.

8 సత్యము

అశ్వమేధ సహస్రం చ సత్యం చ తులయా ధృతమ్ ।
అశ్వమేధ సహస్రాద్ధి సత్యమేవ విశిష్యతే ॥

వేయి అశ్వమేధ యాగములను, సత్యమును త్రాసున పెట్టి తూచినచో వేయి అశ్వమేధముల కంటె సత్యమే అధికమగును.

9 సత్సాంగత్యము

అనుగన్తుం సతాం వర్త్మ కృత్స్నం యది న శక్యతే ।
స్వల్పమప్యనుగన్తవ్యం మార్గస్థో నావసీదతి॥

సత్పురుషుల మార్గమును పూర్తిగా ననుసరించుటకు శక్యము కాక పోయినచో కొంచమైనను అనుసరింపవలెను. మంచి మార్గమున నున్నవారు నశింపరు.

10 ప్రవర్తనము

ప్రత్యహం ప్రత్యవేక్షేత నరశ్చరిత మాత్మనః ।
కిం ను మే పశుభిస్తుల్యం కిం ను సత్పురుషైరితి॥

ప్రతిదినమును మనుష్యుడు తన ప్రవర్తనమును పరీక్షించుకొను చుండవలెను. "నా ప్రవర్తనము పశువుల ప్రవర్తనముతో సమానముగా నున్నదా, సత్పురుషుల ప్రవర్తనముతో సమానముగా నున్నదా"-అని

## 11 సత్సాంగత్యము

సద్భిరేవ సహాసీత సద్భిః కుర్వీత సంగతిమ్ ।
సద్భిర్వివాదం మైత్రీం చ నాసద్భిః కించి దాచరేత్ ॥

సత్పురుషుల తోడనే కూర్చుండవలెను. సత్పురుషుల తోడనే సహవాసము చేయవలెను. వివాదమును కాని, స్నేహమునుకాని, సత్పురుషులతోడనే చేయవలెను. సత్పురుషులు కానివారితో కలిసి యేమియును చేయరాదు.

## 12 కర్మఫలము

అనభిధ్యా పరస్వేషు సర్వసత్త్వేషు సౌహృదమ్ ।
కర్మణాం ఫలమస్తీతి మనసా త్రితయం చరేత్ ॥

పరధనమునం దనాసక్తి, అన్ని ప్రాణులయందును దయ, కర్మలకు ఫలము కలదను భావము — ఈ మూడు విషయములను మనస్సునం దుంచుకొనవలెను.

## 13 మూడు పాపములు

ప్రాణాతి పాతః స్తైన్యం చ పరదారాభిమర్శనమ్ ।
త్రీణి పాపాని కాయేన నిత్యశః పరివర్జయేత్ ॥

ఆత్మహత్య, దొంగతనము, పరుని భార్యను స్పృశించుట అను నీ మూడు శారీరక పాపములను నిత్యమును పరిత్యజించవలెను.

## 14 పురుషార్థములు

ఉపకారః పరోధర్మః పరార్థం కర్మ నైపుణమ్ ।
పాత్రే దానం పరః కామః పరోమోక్షో వితృష్ణతా ॥

ఉపకారముచేయుట ఉత్తమమైన ధర్మము. నేర్పుతో పనిచేయుట ఉత్తమమైన అర్థము. అర్థునకు దానముచేయుట ఉత్తమమైన కామము. కోరిక లేకుండుట ఉత్తమమైన మోక్షము.

15 దయ

న హీదృశం సంవననం త్రిషు లోకేషు విద్యతే ।
దయా మైత్రీ చ భూతేషు దానం చ మధురా చ వాక్ ॥

భూతములయందు దయయును, స్నేహమును, దానము, మధురమైన వాక్కు — ఈ మూటి వంటి వశీకరణ సాధనము మూడులోకముల యందును మరి యొకటి లేదు.

16 ప్రవర్తనము

యాన్తి న్యాయ ప్రవృత్తస్య తిర్యంచోఽపి సహాయతామ్ ।
అపంథానం తు గచ్ఛన్తం సోదరోఽపి విముంచతి ॥

న్యాయమైన ప్రవృత్తి గల వానికి జంతువులు గూడ సహాయపడును. అపమార్గమున పోవుచున్న వానిని సోదరుడు కూడ విడుచును.

17 పరిహారములేని పాపములు

మిత్రద్రుహః కృతఘ్నస్య స్త్రీఘ్నస్య పిశునస్య చ ।
చతుర్ణామపి చైతేషాం నిష్కృతిర్నైవ విశ్రుతా ॥

మిత్రద్రోహి, కృతఘ్నుడు, స్త్రీఘాతకుడు, కొండెములు చెప్పువాడు — ఈ నలుగురికి ప్రాయశ్చిత్తము లేదు.

18 పరిశుద్ధత

చక్షుః పూతం న్యసేత్పాదం వస్త్రపూతం జలం పిబేత్ ।
సత్యపూతాం వదేద్వాణీం మనఃపూతం సమాచరేత్ ॥

కంటిచే చూడ బడిన దాని యందే పాదము నుంచవలెను. వస్త్రముచే శుద్ధిచేయ (వడకట్ట) బడిన జలమునే త్రాగవలెను. సత్యముచే శుద్ధమైన వాక్కునే చెప్పవలెను. మనస్సునకు ఇష్టమైన దానినే చేయవలెను.

19 పాతివ్రత్యము

నాస్తి యజ్ఞం స్త్రియః కించి న్నవ్రతం నోపవాసకమ్ ।
యా తు భర్తరి శుశ్రూషా తయా స్వర్గం జయత్యసౌ ॥

స్త్రీలకు యజ్ఞము కాని, వ్రతములు కాని, ఉపవాసము కాని, యేదియును అవసరములేదు. భర్తృశుశ్రూష వలననే స్త్రీ స్వర్గమును పొందును.

20 పాతివ్రత్యము

భర్తా దేవో గురుర్భర్తా ధర్మతీర్థవ్రతాని చ ।
తస్మాత్సర్వం పరిత్యజ్య పతిమేకం భజేత్సతీ ॥

భర్తయే దైవము, భర్తయే గురువును, ధర్మమును, తీర్థములును, వ్రతములును కావున అన్నిటిని వదలి పతివ్రత భర్తను మాత్రమే సేవింపవలెను.

## 21 బుద్ధి

సత్యానుసారిణీ లక్ష్మీః కీర్తిస్త్యాగానుసారిణీ ।
అభ్యాససారిణీ విద్యా బుద్ధిః కర్మానుసారిణీ॥

లక్ష్మి సత్యమును అనుసరించి యుండును. కీర్తి త్యాగమును అనుసరించి యుండును. విద్య అభ్యాసమును అనుసరించి యుండును. బుద్ధి కర్మను అనుసరించి యుండును.

## 22 దయ

సదయం హృదయం యస్య భాషితం సత్యభూషితమ్ ।
కాయః పరహితో యస్య కలిస్తస్య కరోతి కిమ్ ॥

ఎవనికి హృదయము దయతో కూడి యుండునో, వాక్కు సత్యముతో కూడి యుండునో, శరీరము పరహితము కొరకై యుండునో – అట్టి వానిని కలి యేమి చేయును?

## 23 స్త్రీలోలత

కిం విద్యయా కిం తపసా కిం యోగేన శ్రుతేన చ ।
కిం వివిక్తేన మౌనేన స్త్రీభి ర్యస్య మనో హృతమ్ ॥

ఎవని హృదయము స్త్రీలచే హరించ బడినదో అట్టి వానికి విద్యచేత నేమి ప్రయోజనము, తపస్సుచేతను, యోగముచేతను, వేదముచేతను, ఏకాంతముగా నుండుట చేతను, మౌనముచేతను, ఏమి ప్రయోజనము ?

### 24 పోషింపవలసినవారు

అతిథి ర్బాలకః పత్నీ జననీ జనక స్తథా ।
పంచైతే గృహిణః పోష్యా ఇతరే చ స్వశక్తితః ॥

అతిథి, బాలుడు, భార్య, తల్లి, తండ్రి - యీ యైదు గురిని గృహస్థుడు తప్పక పోషించ వలెను. శక్తి ననుసరించి యితరులను పోషింప వలెను.

### 25 విద్యార్థి : సుఖార్థి

సుఖార్థీ త్యజతే విద్యాం విద్యార్థీ త్యజతే సుఖమ్ ।
సుఖార్థినః కుతో విద్యా కుతో విద్యార్థినః సుఖమ్ ॥

సుఖమును కోరు వాడు విద్యను విడుచును; విద్యను కోరు వాడు సుఖమును విడుచును. సుఖమును కోరు వానికి విద్య యెట్లు వచ్చును; విద్యను కోరు వానికి సుఖ మెట్లు కలుగును ?

### 26 విద్యాదానము

అన్నదానాత్పరం దానం విద్యాదాన మతః పరమ్।
అన్నేన క్షణికా తృప్తి ర్యావజ్జీవం చ విద్యయా॥

అన్నదానము ఇతర దానములకంటె గొప్పది. విద్యా దానము అంత కంటె గొప్పది. అన్నముచే ఒక్క క్షణము మాత్రము తృప్తి కలుగును. విద్యచే యావజ్జీవము తృప్తి కలుగును.

## 27 మృత్యువు

పండితే చైవ మూర్ఖే చ బలవత్యపి దుర్జనే ।
ఈశ్వరే చ దరిద్రే చ మృత్యోః సర్వత్ర తుల్యతా॥

పండితుని యందు, మూర్ఖుని యందు, బలవంతుని యందు, దుర్జనుని యందు, ఐశ్వర్యవంతుని యందు, దరిద్రుని యందు - అందరి యందు మృత్యువునకు సమానత్వమే.

## 28 ఇంద్రియ సుఖములు

విషస్య విషయాణాం చ దృశ్యతే మహదన్తరమ్ ।
ఉపభుక్తం విషం హన్తి విషయాః స్మరణాదపి॥

విషమునకు, ఇంద్రియ సుఖములకును విశేష భేదము కలదు. తిని నప్పుడే విషము చంపును. ఇంద్రియ సుఖములు తలంచుకొనినను చంపును.

## 29 పండిత సహవాసము

పండితైః సహ సాంగత్యం పండితైః సహ సంకథాః ।
పండితైః సహ మిత్రత్వం కుర్వాణో నావసీదతి॥

పండితులతో సాంగత్యము, పండితులతో మాటలాడుట, పండితులతో స్నేహము - వీనిని చేయువాడు నశింపడు.

## 30 శీలము

శీలం శౌర్య మనాలస్యం పాండిత్యం మిత్రసంగ్రహః।
అచోరహరణీయాని పంచైతాన్యక్షయో నిధిః॥

శీలము, శౌర్యము, సోమరితనము లేకుండుట, పాండిత్యము, స్నేహితులను సంపాదించుట – ఈయైదును దొంగలు హరించలేని, తరగని నిధులు.

### 31 సత్ప్రవర్తన

మాతృవత్పరదారాంశ్చ పరద్రవ్యాణి లోష్టవత్ ।
ఆత్మవత్సర్వభూతాని యః పశ్యతి స పశ్యతి॥

పరుని భార్యను తల్లివలెను, పరుని ద్రవ్యమును మంటి బెడ్డవలెను, సర్వభూతములను తనవలెను ఎవడు చూచునో వాడు నిజమైన పండితుడు.

### 32 శీలము

ధర్మార్థకామమోక్షాణాం యస్యైకోఽపి న విద్యతే ।
అజాగళస్తనస్యేవ తస్య జన్మ నిరర్థకమ్॥

ఎవనియందు ధర్మార్థకామమోక్షములలో నొక్కటియైనను కనుపించదో అతని జన్మము మేక మెడయందుండు స్తనములవలె వ్యర్థము.

### 33 గుణములు

స జీవతి గుణా యస్య ధర్మో యస్య స జీవతి ।
గుణధర్మవిహీనో యో నిష్ఫలం తస్య జీవితమ్॥

ఎవనికి మంచి గుణములు కలవో వాని జీవనము సార్థకము. ఎవడు ధర్మాత్ముడో వాని జన్మ సార్థకము. గుణ ధర్మములు లేనివాని జీవితము నిరర్థకము.

34 కర్మ

ముహూర్తమపి జీవేత నరః శుక్లేన కర్మణా ।
న కల్పమపి కృష్ణేన లోకద్వయ విరోధినా॥

శుద్ధకర్మలతో మనుష్యుడొక్క ముహూర్తము జీవించినను చాలును. ఇహ పర విరుద్ధములైన పాడుకర్మలతో ఒక కల్పము జీవించినను వ్యర్థము.

35 జ్ఞానము

నాస్తి కామసమో వ్యాధి ర్నాస్తి మోహసమో రిపుః ।
నాస్తి క్రోధసమో వహ్ని ర్నాస్తి జ్ఞానాత్పరం సుఖమ్॥

కామము వంటి వ్యాధిలేదు. మోహము వంటి శత్రువు లేదు. క్రోధము వంటి యగ్నిలేదు. జ్ఞానము కంటె గొప్ప సుఖము మరి యొకటి లేదు.

36 సత్యము

సత్యేన ధార్యతే పృథ్వీ సత్యేన తపతే రవిః ।
సత్యేన వాయవో వాన్తి సర్వం సత్యే ప్రతిష్ఠితమ్॥

పృథివి సత్యముచే నిలచుచున్నది. సూర్యుడు సత్యముచే ప్రకాశించుచున్నాడు. వాయువులు సత్యముచే వీచుచున్నవి. సర్వమును సత్యముమీద నాధారపడి యున్నది.

37 అలంకారము

హస్తస్య భూషణం దానం సత్యం కంఠస్య భూషణమ్ ।
శ్రోత్రస్య భూషణం శాస్త్రం భూషణైః కిం ప్రయోజనమ్॥

చేతికి అలంకారము దానము. కంఠమునకు అలం కారము సత్యము. చెవికి అలంకారము శాస్త్రము. మిగిలిన అలంకారములు వ్యర్థములు.

38 కాలము

నాకాలే మ్రియతే జన్తు ర్విద్ధః శరశతైరపి ।
కుశకణ్టకవిద్ధోఽపి ప్రాప్తకాలో న జీవతి॥

నూరు బాణములచే కొట్టబడి నప్పటికి మరణకాలము రానిదే యే జంతువున్ను చావదు. మరణకాలము వచ్చినచో నొక గడ్డిపరక గాని, ముల్లు గాని గుచ్చికొనినను చచ్చును..

39 ధర్మము, కీర్తి

అస్థిరం జీవితం లోకే అస్థిరే ధనయావనే ।
అస్థిరాః పుత్రదారాశ్చ ధర్మః కీర్తిర్ద్వయం స్థిరమ్॥

ఈ లోకమున జీవితము అస్థిరము; ధన యావనములు అస్థిరములు; భార్యా పుత్రులు అస్థిరములు; ధర్మము, కీర్తి యీ రెండును మాత్రము స్థిరములు.

40 క్రోధము

క్రోధో మూల మనర్థానాం క్రోధః సంసారబన్ధనమ్ ।
ధర్మక్షయకరః క్రోధ స్తస్మాత్తం పరివర్జయేత్ ॥

కోపము అన్ని యనర్థములకును మూలము. కోపము సంసార బంధనము. కోపము ధర్మమును క్షీణింప జేయును. కాబట్టి కోపమును విడువ వలెను.

### 41 కర్తవ్యము

కర్తవ్యమేవ కర్తవ్యం ప్రాణైః కణ్ఠగతైరపి ।
అకర్తవ్యం న కర్తవ్యమ్ ప్రాణైః కణ్ఠగతైరపి॥

కంఠమునందు ప్రాణములు పోవుటకు సిద్ధముగా నున్నను చేయదగిన దానినే చేయ వలయును. కంఠమునందు ప్రాణములు పోవుటకు సిద్ధముగా నున్నను చేయదగని దానిని చేయ రాదు.

### 42 విత్తము

ఉత్తమం స్వార్జితం భుక్తం మధ్యమం పితురార్జితమ్ ।
కనిష్ఠం భ్రాతృవిత్తం చ స్త్రీవిత్త మధమాధమమ్॥

స్వార్జితమును అనుభవించుట ఉత్తమము. పితురార్జితము ననుభవించుట మధ్యమము. భ్రాతృద్రవ్యము అధమము. స్త్రీద్రవ్యము అధమాధమము.

### 43 సోమరితనము

అలసస్య కుతో విద్యా అవిద్యస్య కుతోధనమ్ ।
అధనస్య కుతో మిత్ర మమిత్రస్య కుతః సుఖమ్॥

సోమరిపోతునకు విద్యయెక్కడ? విద్య లేని వానికి ధన మెక్కడ? ధనము లేని వానికి మిత్రు డెక్కడ? మిత్రులు లేని వానికి సుఖ మెక్కడ ?

### 44 ఐదుగురు తల్లులు

రాజపత్నీ గురోః పత్నీ భ్రాతృపత్నీ తథైవ చ ।
పత్నీమాతా స్వమాతా చ పంచైతా మాతరః స్మృతాః॥

రాజు భార్య, గురుని భార్య, సోదరుని భార్య, భార్య తల్లి, తన తల్లి-యీ యైదుగురును తల్లులని చెప్పబడుదురు.

### 45 వ్యర్థవస్తువులు

పరాధీనం వృథా జన్మ పరస్త్రీషు వృథా సుఖమ్ ।
పరగేహే వృథా లక్ష్మీ ర్విద్యా యా పుస్తకే వృథా॥

పరాధీనమైన జన్మము వ్యర్థము. పరస్త్రీల యందు సుఖము వ్యర్థము. పరునియింటనున్న ఐశ్వర్యము వ్యర్థము. పుస్తకమునందున్న విద్య వ్యర్థము.

### 46 మంచితనము

సద్భావేన జయేన్మిత్రం సద్భావేన చ బాన్ధవాన్ ।
స్త్రీభృత్యాన్ దానమానాభ్యాం దాక్షిణ్యే నేతరం జనన్॥

మంచితనము చేత మిత్రుని జయించ వలెను. మంచితనముచే బంధువులను జయించ వలెను. స్త్రీలను దానము చేతను, సేవకులను గౌరవించుట చేతను జయించ వలెను. మిగిలిన జనులను దయచే జయించ వలెను.

### 47 తృప్తి

సంతోషస్త్రిషు కర్తవ్యః కలత్రే భోజనే ధనే ।
త్రిషు చైవ న కర్తవ్యో దానే తపసి పాఠనే॥

తన భార్య, భోజనము, ధనము ఈ మూటి యందును తృప్తి పొంద వలెను. దానము, తపస్సు, చదువు చెప్పుట ఈ మూటి యందును తృప్తి పొంద కూడదు.

48 ధర్మము

న పుత్రాత్పరో లాభో న భార్యాయాః పరం సుఖమ్ ।
నధర్మాత్పరం మిత్రం నానృతాత్పాతకం పరమ్॥

పుత్ర లాభము కంటె గొప్ప లాభము లేదు. భార్యా సుఖము కంటె గొప్ప సుఖము లేదు. ధర్మము కంటె గొప్ప మిత్రము లేదు. అనృతము కంటె గొప్ప పాతకము లేదు.

49 శీలము

జ్యాయాంసమపి శీలేన విహీనం నైవ పూజయేత్ ।
అపి శూద్రం చ ధర్మజ్ఞం సద్వృత్త మభిపూజయేత్॥

తన కంటె పెద్దవాడైనప్పటికి శీలము లేని వానిని పూజింప కూడదు. ధర్మము నెరిగి సత్ప్రవర్తన కలిగిన శూద్రుడైనను పూజింప వలెను.

50 గుణము

శత్రోరపి గుణా వాచ్యా దోషా వాచ్యా గురోరపి ।
సర్వదా సర్వయత్నేన పుత్రే శిష్యవదాచరేత్॥

శత్రువులైనప్పటికి గుణములు ఎంచదగినవే. గురువులైనప్పటికి దోషములు చెప్ప దగినవే. ఎల్లప్పుడును అన్ని విధముల పుత్రుని శిష్యుని వలె చూడ వలెను.

51 ధర్మము

సుకులే యోజయేత్కన్యాం పుత్రం విద్యాసు యోజయేత్ ।
వ్యసనే యోజయేచ్ఛత్రు మిష్టం ధర్మేణ యోజయేత్॥

కన్యను మంచికులములో చేర్చవలెను. పుత్రుని విద్యలలో చేర్చవలెను. శత్రువును దుర్గుణములలో చేర్చవలెను. ఇష్టుడైనవానిని ధర్మములో చేర్చవలెను.

### 52 మైత్రి

న కశ్చిత్కస్యచిన్మిత్రం న కశ్చిత్కస్యచిద్రిపుః।
కారణేన హి జాయన్తే మిత్రాణి రిపవస్తథా॥

ఎవ్వడును ఎవ్వనికిని మిత్రుడు కాడు. ఎవ్వడును ఎవ్వనికిని శత్రువు కాడు. మిత్రులు, శత్రువులు, కారణము వలన కలుగు చుందురు.

### 53 పరనింద

పరదారాన్ పరద్రవ్యం పరీవాదం పరస్య చ ।
పరీహాసం గురోః స్థానే చాపల్యం చ వివర్జయేత్॥

పరునిభార్యను, పరద్రవ్యమును, పరునినిందను, పరిహాసమును, గురువుగారి వద్ద చపలత్వమును విడువవలెను.

### 54 వయస్సు

నిమేషమాత్రమపి తే వయో గచ్ఛన్న తిష్ఠతి ।
తస్మాద్దేహేష్వనిత్యేషు కీర్తిమేకా ముపార్జయ॥

వయస్సు గడచును. ఒక్క నిమిష మైనను నిలువదు. కాబట్టి యీ యనిత్యమైన దేహములలో (స్థిరమైన) కీర్తిని సంపాదింపుము.

### 55 వివేకము

కర్మాయత్తం ఫలం పుంసాం బుద్ధిః కర్మానుసారిణీ ।
తథాపిసు సుధియా భావ్యం విచార్యైవ కుర్వతా॥

మనుష్యులకు వారి కర్మలు ఫలమును బట్టి వచ్చును. బుద్ధి కర్మను అనుసరించి పోవుచుండును. అయినను బుద్ధి మంతుడు విచారించియే పనులను చేయుచుండవలెను.

### 56 విడువదగినవి

కుదేశం చ కువృత్తిం చ కుభార్యాం కునదీం తథా ।
కుద్రవ్యం చ కుభోజ్యం చ వర్జయేత్తు విచక్షణః॥

చెడ్డ దేశమును, చెడ్డ వృత్తిని, చెడ్డ భార్యను, చెడ్డ నదిని, చెడ్డ ద్రవ్యమును, చెడ్డ భోజనమును తెలివి గలవాడు విడువ వలెను.

### 57 అస్థిరమైన వానిని నమ్ముకొనుట

యో ధ్రువాణి పరిత్యజ్య అధ్రువం పరిషేవతే ।
ధ్రువాణి తస్య నశ్యన్తి అధ్రువం నష్టమేవ చ॥

ఎవడైతే స్థిరమైన వాటిని విడిచి అస్థిరములైన వాటిని ఆచరించునో వానికి స్థిరమైనవి నశించును. అస్థిరములును నష్టమగును.

### 58 సమర్థత

కోఽతిభారః సమర్థానాం కిం దూరం వ్యవసాయినామ్ ।
కోవిదేశః సవిద్యానాం కః పరః ప్రియవాదినామ్॥

సమర్థులకు అతిభారమైన దేదియును లేదు. పట్టుదల గలవానికి దూరమైన దేదియును లేదు. విద్య గలవారికి విదేశ మేదియును లేదు. మంచి మాట లాడు వారికి శత్రువులుండరు.

### 59 బలము

న చ విద్యాసమో బన్ధుః న చ వ్యాధిసమో రిపుః ।
న చాపత్యసమః స్నేహాః న చ దైవాత్పరం బలమ్ ॥

విద్యకు సమమైన బంధువు లేదు. వ్యాధికి సమమైన శత్రువు లేదు. సంతానమునకు సమమైన ప్రియము లేదు. దైవము కంటె మించిన బలము లేదు.

### 60 ధర్మము

అజరామరవత్ప్రాజ్ఞో విద్యామర్థం చ సాధయేత్ ।
గృహీత ఇవ కేశేషు మృత్యునా ధర్మమాచరేత్ ॥

ప్రాజ్ఞుడు ముసలితనము, మరణము లేని వాని వలె విద్యను, అర్థమును సంపాదింప వలెను. మృత్యువు (తన) జుట్టు పట్టి లాగుచున్నట్లుగా (భావించి) ధర్మమును ఆచరించవలెను.

### 61 ఆరు తప్పులు

షడ్దోషాః పురుషేణేహ హాతవ్యా భూతిమిచ్ఛతా ।
నిద్రా తంద్రా భయం క్రోధ ఆలస్యం దీర్ఘసూత్రతా ॥

నిద్ర, బద్ధకము, భయము, కోపము, ఆలస్యము, అతినెమ్మది తనము – ఈ ఆరుదోషములున్ను ఐశ్వర్యమును కోరు మనుష్యుడు విడిచిపెట్ట వలెను.

### 62 సుఖ దుఃఖములు

సుఖమాపతితం సేవ్యం దుఃఖమాపతితం తథా ।
చక్రవత్పరివర్తన్తే దుఃఖాని చ సుఖాని చ ॥

సంభవించిన సుఖమును, సంభవించిన దుఃఖమును అనుభవించ వలెను. సుఖదుఃఖములు చక్రమువలె తిరుగు చుండును.

### 63 గుణదోషములు

ఆరోప్యతే శిలాశైలే యత్నేన మహతా యథా ।
నిపాత్యతే క్షణే నాధస్తథాత్మా గుణదోషయోః॥

ఒకశిల యెత్తితే అతి కష్టమువిూద కొండ మీాదికి యెత్తబడునో, యెత్తితే సులభముగా నొక్కక్షణములో క్రిందికి త్రోయబడునో అట్లే ఆత్మయును గుణదోషముల యందు ప్రవర్తించును. (గుణమును సంపాదించుట అతి కష్టము. దోషమునకు లోనగుట అతిసులభము.)

### 64 కరుణ, క్షమ

ధర్మార్థకామ తత్త్వజ్ఞో నైకాన్త కరుణోభవేత్ ।
నహి హస్తస్థమప్యన్నం క్షమావాన్ భక్షితుం క్షమః॥

ధర్మార్థకామముల తత్త్వముల నెరిగిన వాడు, అన్ని వేళలను కరుణయే ప్రధానముగా పెట్టుకొన కూడదు. అతి ఓరిమి కలవాడు అరచేతి యందున్న అన్నమును గూడ భుజించుటకు సమర్థుడు కాక యుండును.

65 భయము

తావద్భయాద్ధి భేతవ్యం యావద్భయ మనాగతమ్।
ఆగతం తు భయం వీక్ష్య ప్రహర్తవ్య మభీతవత్॥

— దగ్గరకు రానంత వరకు ప్రమాదమనగా భయపడ వలెను. ప్రమాదము ఎదుర్కొనగా నిర్భయముగా ప్రతిక్రియ చేయవలెను.

66 విశ్వాస ఘాతకులు

మిత్రద్రోహీ కృతఘ్నశ్చ తథా విశ్వాస ఘాతకః।
తే నరా నరకం యాన్తి యావచ్చన్ద్రదివాకరౌ॥

స్నేహితునికి ద్రోహము చేసినవాడు, పొందిన ఉప కారమును మరచినవాడు, నమ్మిన వానిని మోసపుచ్చువాడు—ఈ ముగ్గురును శాశ్వత నరకమును పొందుదురు.

67 ఆపదలు

వ్యసనేష్వేవ సర్వేషు యస్య బుద్ధిర్న హీయతే।
స తేషాం పారమభ్యేతి తత్ప్రభావా దసంశయమ్॥

ఆపదలు సంభవించినప్పుడు ఎవనికైతే బుద్ధి నశింపదో వాడు బుద్ధిబలముచే ఆపదలను దాట గలుగును.

68 అపరిచితునితో స్నేహము

యస్య న జ్ఞాయతే వీర్యం నకులం న విచేష్టితమ్।
న తేన సంగతిం కుర్యా దిత్యువాచ బృహస్పతిః॥

ఎవని వీర్యము, కులము, చేష్టలు తెలియరానివో వానితో సహవాసము చేయరాదు. (అని బృహస్పతి చెప్పెను)

### 69 చేయరానిపనులు

అయశః ప్రాప్యతే యేన యేన చాపగతిర్భవేత్ ।
స్వర్గాచ్చ భ్రశ్యతే యేన తత్కర్మ న సమాచరేత్ ॥

ఏ పని వలన అపయశస్సు సంభవించునో, ఏ పని చేయుట వలన నరకము సంభవించునో, దేనిచే స్వర్గము నుండి జారి పడిపోవలసి యుండునో, అట్టి పనిని చేయరాదు.

### 70 ఐశ్వర్యమునకు ఫలము

అగ్నిహోత్రఫలా వేదాః శీలవృత్తఫలం శ్రుతమ్ ।
రతిపుత్రఫలా దారా దత్తభుక్తఫలం ధనమ్ ॥

వేదములు అగ్నిహోత్రములు ఫలముగా గలవై యున్నవి. విద్య శీలవృత్తములు ఫలముగా గలదై యున్నది. భార్య సుఖము, పుత్రులు ఫలముగా గలదై యున్నది. ధనము దాన భోగములు ఫలముగా గలదై యున్నది.

### 71 ఐదుగురు తండ్రులు

జనితా చోపనేతా చ యశ్చ విద్యాం ప్రయచ్ఛతి ।
అన్నదాతా భయత్రాతా పంచైతే పితరః స్మృతాః ॥

పుట్టుక నిచ్చినవాడు, ఉపనయనము చేసినవాడు, విద్య నేర్పినవాడు, అన్నము నిచ్చినవాడు, భయము నుండి రక్షించినవాడు, యీ యైదుగురును తండ్రులనబడుచున్నారు.

### 72 స్వర్గసుఖము పొందువారు

సర్వహింసా నివృత్తా యే నరాః, సర్వసహాశ్చ యే ।
సర్వస్యాశ్రయ భూతాశ్చ తే నరాః స్వర్గగామినః ॥

అన్ని హింసల నుండియు మరలి నట్టియు, సర్వమును సహించు నట్టియు, అందరికిని ఆశ్రయభూతు లైనట్టియు జనులు స్వర్గమునకు పోవుదురు.

73 మాంస భోజనము

యోఽత్తి యస్య యదా మాంసముభయోః పశ్యతాంతరమ్।
ఏకస్య క్షణికా ప్రీతి రన్యః ప్రాణైర్వియుజ్యతే॥

ఒకడు మరియొకనిని చంపి వాని మాంసమును తిను నప్పుడు ఆ యిరువురికి భేదమును చూడుడు. ఒకనికి ఒక క్షణము ప్రీతి కలుగును; రెండవవానికి ప్రాణములు పోవును.

74 మాంస భోజనము

స్వచ్ఛందవన జాతేన శాకేనాపి ప్రపూర్యతే ।
అస్య దగ్ధోదరస్యార్థే కః కుర్యాత్పాతకం మహత్॥

మనకడుపు వనములో సహజముగ పుట్టిన కాయ గూరలచేతను కూడ నిండును. అట్టి దౌర్భాగ్యపు కడుపు నిమిత్తము గొప్పపాతకమును ఎవడు చేయును?

75 విద్య

విద్యయా వినయావాప్తిః సా చేదవినయావహా ।
కిం కుర్మః కం ప్రతి బ్రూమో గరదాయాం స్వమాతరి॥

విద్యవలన వినయము లభించవలెను. ఆ విద్యయే అవినయమును కలుగ జేసినచో ఏమి చేయగలము? తన తల్లియే విషము నిచ్చినచో ఎవరితో చెప్పుకొనుట !

76 ఆశ

వేధా ద్వేధా భ్రమం చక్రే కాంతాసు కనకేషు చ ।
తాసు తేష్వప్యనాసక్తః సాక్షాద్భర్గో నరాకృతిః॥

బ్రహ్మ స్త్రీల యందును, బంగారము నందును రెండు విధములుగా భ్రమను కల్పించెను. ఈ రెంటి యందును ఆసక్తి లేనివాడు సాక్షాత్తు మనుష్య రూపమున నున్న శివుడే.

77 శత్రువులు

మునేరపి వనస్థస్య స్వాని కర్మాణి కుర్వతః ।
తత్రాపి సంభవన్త్యేతే మిత్రోదాసీన శత్రవః॥

వనమునందుండి తనపనులను చేసుకొనుచున్న మునికి కూడ మిత్రులు, శత్రువులు, ఉదాసీనులు సంభవించు చుందురు.

78 పరోపకారులు

సర్వంసహా యే ఋజవః ప్రతిజ్ఞాతార్థపాలకాః ।
పరోపకారిణః సేవ్యా నిర్ధనా అపి తే జనాః॥

సమస్తమును సహించు వారిని, న్యాయమైన ప్రవర్తన కలిగినట్టి వారిని ప్రతిజ్ఞను పాలించుకొను నట్టి వారిని పరోపకారులైనట్టి వారిని - వారు నిర్ధనులైనను - సేవింపవలెను.

79 శరణాగత రక్షణము

శరణాగతరక్షార్థం స్త్రీగోద్విజహితాయ చ ।
స్వామ్యర్థం యస్త్యజేత్ప్రాణాం స్తస్య లోకాః సనాతనాః॥

శరణాగతుని రక్షించుటకును, స్త్రీలకు గోవులకు బ్రాహ్మణులకు హితము కోరకును, తనయజమానుని కోరకును, ప్రాణములను త్యజించు వానికి శాశ్వత లోకములు ప్రాప్తించును.

80 కృతఘ్నత

కృతఘ్నస్య శిశుఘ్నస్య స్త్రీఘ్నస్య పిశునస్య చ ।
చతుర్ణామపి చైతేషాం నిష్కృతిం నైవ శుశ్రుమః॥

ఉపకారమును మరచు వానికి, శిశువును చంపు వానికి, స్త్రీని చంపు వానికి, ద్రోహికి యీనలుగురికిని ప్రాయశ్చిత్తము లేదు.

81 విద్యాధనము

పరం పలితకాయేన కర్తవ్యః శ్రుతసంగ్రహః ।
న తత్ర ధనినో యాన్తి యత్ర యాన్తి బహుశ్రుతాః॥

మిక్కిలి పండిన శరీరము గలవాడు గూడ జ్ఞాన సంపాదనము చేయవలసి యున్నది. పండితులు పొందు పుణ్య లోకములను ధనవంతులు పొందలేరు.

82 సహనము

క్షన్తవ్యో మందబుద్ధీనా మపరాధో మనీషిణా ।
నహి సర్వత్ర పాండిత్యం సులభం పురుషే క్వచిత్॥

బుద్ధిమంతులు మందబుద్ధుల యపరాధములను క్షమింపవలెను. ఏపురుషునకును అన్నిటి యందును పాండిత్యము సులభము కాదు.

83 ఆలస్యము

రాగే ద్వేషే చ మానే చ ద్రోహే పాపే చ కర్మణి ।
అప్రియే చైవ కర్తవ్యే చిరకారీ ప్రశస్యతే ॥

కోరిక, ద్వేషము, అభిమానము, ద్రోహము, పాప కర్మ, అనిష్టమైన పని – ఇవి చేయ వలసి నప్పుడు, ఆలస్యము చేయువాడు ప్రశంసనీయుడు.

84 ధ్యానము

లాభ స్తేషాం జయ స్తేషాం కుత స్తేషాం పరాజయః ।
యేషాం హృదిస్థో భగవాన్మంగళాయతనో హరిః॥

ఎవరి హృదయమున భగవంతుడై నట్టియు మంగళము నకు స్థానమైనట్టియు హరి యుండునో వారికి లాభము కలుగును. వారికి జయము కలుగును. వారికి పరాజయ మెచ్చటి నుండి వచ్చును?

85 కామము

తావన్మహత్త్వం పాండిత్యం కులీనత్వం వివేకితా ।
యావజ్జ్వలతి నాంగేషు స్వతః పంచేషు పావకః॥

ఎంతవరకు అవయవములందు మన్మథాగ్ని స్వయముగా జ్వలింపదో అంతవరకే గొప్పతనము, పాండిత్యము, కులీనత్వము, వివేకము నుండును.

86 దైవము

న దేవో విద్యతే కాష్ఠే నపాషాణే న మృణ్మయే ।
భావేషు విద్యతే దేవ స్తస్మాద్భావో హి కారణమ్ ॥

దైవము కఱ్ఱయందు గాని రాతియందు గాని మంటి యందుకాని లేదు; దైవము భావనయందే కలదు. కాబట్టి భావనయే అన్నిటికి కారణము.

87 అన్యాయము

అన్యాయోపార్జితం ద్రవ్యం దశవర్షాణి తిష్ఠతి ।
ప్రాప్తే చైకాదశే•వర్షే సమూలం చ వినశ్యతి ॥

అన్యాయముగా నార్జించిన ద్రవ్యము పది సంవత్స రము లుండును. పదునొకండవ సంవత్సరము రాగానే అది సమూలముగా నశించును.

88 విద్యారక్షణము

నిత్యం క్రోధాచ్ఛ్రియం రక్షేత్తపో రక్షేచ్చ మత్సరాత్ ।
విద్యాం మానాపమానాభ్యా మాత్మానం తు ప్రమాదతః॥

ఎల్లప్పుడును – కోపమువలన ఐశ్వర్యము, అసూయ వలన తపస్సు, మానావమానముల వలన విద్య, పొరపాటు వలన ఆత్మ చెడకుండ కాపాడుకోవలెను.

89 దయ

క్షమాతుల్యం తపోనాస్తి నసంతోషాత్పరమ్ సుఖమ్ ।
న చ తృష్ణా పరోవ్యాధి ర్నచ ధర్మో దయాపరః ॥

ఓరిమితో సమానమైన తపస్సులేదు. సంతోషము కంటె గొప్ప సుఖము లేదు. ఆశకంటె గొప్ప వ్యాధి లేదు. దయ కంటె గొప్ప ధర్మము లేదు.

90 అహింస

దానేన భోగీ భవతి మేధావీ వృద్ధ సేవయా ।
అహింసా యా చ దీర్ఘాయు రితి ప్రాహుర్మనీషిణః॥

దానము చేయుట వలన భోగముల ననుభవించు వాడగును. వృద్ధులకు సేవ చేయుట వలన బుద్ధిమంతు డగును. అహింస వలన దీర్ఘాయువు గలవా డగును – అని బుద్ధిమంతులు చెప్పుదురు.

91 వాక్కు

గౌర్గౌః కామదుఘా సమ్యక్ప్రయుక్తా స్మర్యతే బుధైః ।
దుః ప్రయుక్తా పునర్గోత్వం ప్రయోక్తుః సైవ శంసతి॥

వాక్కు గోవువంటిది. దానిని సదుపయోగముచేసినచో కామధేనువువలె అభీష్టముల నీడేర్చును. కాని, దురుపయోగముచేసినచో, అట్లు చేసినవానికి గోత్వమును (పశుత్వమును) కలిగించును.

92 కామము

నజాతు కామః కామా నా ముపభోగేన శామ్యతి ।
హావిషా కృష్ణవర్త్మేవ భూయయేవాభివర్ధతే॥

కామము కోరికల ననుభవించుటచే ఎన్నటికిని శమింపదు. నెయ్యి పోయుట వలన నిప్పువలె తిరిగి పెరుగుచునే యుండును.

93 హితబోధ

నా పృష్టః కస్య చిద్బ్రూయా న్నచాన్యాయేన పృచ్ఛతః ।
జానన్నపి హి మేధావీ జడవ ల్లోక అచరేత్॥

అడుగనిదే ఎవరికిని చెప్పకూడదు. అన్యాయముగా నడుగు వానికి చెప్పకూడదు. బుద్ధిమంతుడు తెలిసి యుండియుః జడునివలె లోకమున సంచరించ వలెను.

94 విద్యాబోధ

ధర్మార్థౌ యత్ర న స్యాతాం శుశ్రూషావాపి తద్విధా ।
తత్ర విద్యా న వక్తవ్యా శుభం బీజమి వోషరే॥

ధర్మార్థములు లేని చోట, విన వలెన నని కోరిక లేని చోట, విద్యను చెప్పకూడదు. చెప్పినచో, చవిటి భూమిలో మంచి విత్తనములు జల్లినట్లే యగును.

95 విద్యార్థి

యథా ఖనన్ ఖనిత్రేణ నరో వార్యధిగచ్ఛతి ।
తథా గురుగతాం విద్యాం శుశ్రూషు రధిగచ్ఛతి ॥

మనుష్యుడు గునపముతో త్రవ్వి భూమి నుండి నీరు నెట్లు పొందునో అట్లే గురువువద్దనున్న విద్యను శుశ్రూష వలన పొందును.

96 తల్లిదండ్రుల ఋణము

యం మాతాపితరౌ క్లేశం సహేతే సంభవే నృణామ్ ।
న తస్య నిష్కృతిః శక్యా కర్తుం వర్షశతైరపి ॥

మనుష్యుడు పుట్టినప్పుడు తల్లిదండ్రులు సహించు క్లేశమునకు నూరు సంవత్సరములకైనను ఋణవిమోచనము చేసికొనుటకు శక్యముకాదు.

97 పితృసేవ

పిత్రోర్నిత్యం ప్రియం కుర్యాదాచార్యస్య చ సర్వదా ।
తేషు హి త్రిషు తృప్తేషు తపః సర్వం సమాప్యతే ॥

తలిదండ్రులకు నిత్యము ప్రియము చేయుచుండవలెను. అట్లే ఆచార్యునకును ఎల్లప్పుడు ప్రియము చేయుచుండవలెను. వారు ముగ్గురును తృప్తి పొందినచో తపస్సంతయును పూర్తి యగును.

98 విద్య

శ్రద్దధానః శుభాం విద్యా మాదదీ తావరాదపి ।
అన్త్యాదపి పరం ధర్మం స్త్రీరత్నం దుష్కులాదపి ॥

ఆసక్తి కలవాడై మంచి విద్యను తక్కువవాని నుండి యైనను గ్రహించవలెను. శ్రేష్ఠమైన ధర్మమును అంత్యజుని వద్ద నుండియైనను గ్రహించ వలెను. శ్రేష్ఠమైన స్త్రీని దుష్ట కులము నుండి యైనను గ్రహించవలెను.

99 చేయదగిన కర్మ

యత్కర్మ కుర్వతోఽస్య స్యాత్పరితోషోఽన్తరాత్మనః ।
తత్ప్రయత్నేన కుర్వీత విపరీతం తు వర్జయేత్ ॥

ఏ కర్మ చేయునప్పుడు మనస్సునకు తృప్తి కలుగునో దానిని పూనికతో చేయ వలెను. దానికి విరుద్ధమైన దానిని విడువ వలెను.

100 శుచి

సర్వేషామేవ శౌచానా మర్థశౌచం పరం స్మృతమ్ ।
యోఽర్థే శుచిః స హి శుచి ర్న మృద్వారిశుచిః శుచిః ॥

అన్ని శుచుల లోను ధన విషయమున శుచి గొప్పదని చెప్పబడు చున్నది. ఎవడు ధనమున శుచియో వాడు శుచిగలవాడు కాని మంటి తోను నీటి తోను శుచి యైన వాడు నిజముగా శుచిగలవాడు కాడు.

101 త్యాగము

నాస్తి విద్యాసమం చక్షుర్నాస్తి సత్యసమం తపః ।
నాస్తి రాగసమం దుఃఖం నాస్తి త్యాగసమం సుఖమ్ ॥

విద్యకు సమమైన కన్ను లేదు. సత్యమునకు సమమైన తపస్సు లేదు. అనురాగమునకు సమమైన దుఃఖము లేదు. త్యాగమునకు సమమైన సుఖము లేదు.

102 నీచులతో స్నేహం

న స్థాతవ్యం నగన్తవ్యం క్షణమప్యధమైః సహ ।
పయోఽపి శౌండికీ హస్తే మదిరాం మన్యతే జనః ॥

అధములతో కూడి ఒక క్షణ మైనను ఉండ గూడదు. ఒక క్షణమైనను నడువ గూడదు. కల్లును అమ్మెదాని చేత నున్న పాలను గూడ జనులు కల్లు అనియే తలంచెదరు.

103 పాపము

మనసైవ కృతం పాపం న శరీరకృతం కృతమ్ ।
యేనైవాలింగితా కాన్తా తేనైవాలింగితా సుతా॥

మనస్సు చేతను చేయబడినదే పాపము కాని శరీరముచే చేయబడినది పాపముకాదు ఏశరీరముతో భార్య

ఆలింగనము చేసికొనబడునో ఆశరీరముతోనే కుమారైకూడ ఆలింగనము చేసికొనబడును.

104 కోరికలు

మక్షికా వ్రణ మిచ్ఛన్తి ధన మిచ్ఛన్తి పార్థివాః ।
నీచాః కలహ మిచ్ఛన్తి శాన్తి మిచ్ఛన్తి సాధవః॥

ఈగలు వ్రణమును కోరును. రాజులు ధనమును కోరుదురు. నీచులు కలహమును కోరుదురు. సాధువులు శాంతిని కోరుదురు.

105 హితవర్తనము

వాగ్వాద మర్థసంబంధం పరోక్షే దారదర్శనమ్ ।
యదీచ్ఛేద్విపులాం ప్రీతిం త్రీణి తత్ర న కారయేత్॥

వాగ్వాదము, ధనసంబంధము, భర్తలేనప్పుడు భార్యను చూచుట – విశేషప్రీతిని కోరినచో యీ మూడింటిని విడువవలెను.

106 అదాయవ్యయము

అర్థానామార్జనం కార్యం వర్ధనం రక్షణం తథా ।
భక్ష్యమాణో నిరాదాయః సుమేరురపి హీయతే॥

ధనమును ఆర్జించ వలెను. వృద్ధి పొందించ వలెను. రక్షించ వలెను. ఆదాయము లేక భక్షించినచో మేరుపర్వతము కూడ తరిగి పోవును.

107 యోగ్యత

గుణం పృచ్ఛస్వ మా రూపం శీలం పృచ్ఛస్వ మా కులమ్ ।
సిద్ధిం పృచ్ఛస్వ మా విద్యాం భోగం పృచ్ఛస్వ మా ధనమ్॥

గుణమును అడుగుము, రూపమును అడుగవద్దు శీలమును అడుగుము, కులమును అడుగవద్దు. సిద్ధిని అడుగుము, విద్యను అడుగవద్దు. భోగమును అడుగుము, ధనమును అడుగవద్దు.

### 103 అలంకారము

గుణో భూషయతే రూపం శీలం భూషయతే కులమ్ ।
సిద్ధిర్భూషయతే విద్యాం భోగో భూషయతే ధనమ్॥

గుణము రూపమునకు వన్నెదెచ్చును. శీలము కులమునకు వన్నెదెచ్చును, సిద్ధి విద్యను అలంకరించును. భోగము ధనమునకు వన్నెదెచ్చును.

### 108 నిజమైన భూషణము

ధీరాణాం భూషణం విద్యా మంత్రిణాం భూషణం నృపః ।
భూషణం చ పతిః స్త్రీణాం శీలం సర్వస్య భూషణమ్॥

ధీరులకు విద్య యలంకారము. మంత్రులకు రాజు అలంకారము. స్త్రీలకు పతి యలంకారము. శీలము అందరికిని అలంకారము.

### 110 విడువదగినవి

మహానదీప్రతరణం మహాపురుష విగ్రహమ్ ।
మహాజన విరోధంచ దూరతః పరివర్జయేత్॥

మహానదిని దాటుట, మహాపురుషులతో ద్వేషము, మహాజన విరోధము – ఈ మూడింటిని దూరముగా విడువవలెను.

### 111 దుర్జనత్వము

పరాపకార నిరతైర్దుర్జనైః సహ సంగతిః ।
వదామి భవతస్తత్వం న విధేయా కదాచన ।

పరులకు అపకారము చేయుటయందాసక్తిగల దుర్జనులతో సంబంధము ఎప్పుడును ఉంచుకొన గూడదు.

### 112 కవితాశక్తి

నరత్వం దుర్లభం లోకే విద్యా తత్ర సుదుర్లభా ।
కవిత్వం దుర్లభం తత్ర శక్తిస్తత్ర సుదుర్లభా ॥

ఈ లోకమందు నరత్వము దుర్లభము. నరులలో విద్య దుర్లభము. విద్యావంతులలో కవిత్వము దుర్లభము. కవులలో శక్తి దుర్లభము.

### 113 శోభ

వారిజేనైవ సరసీ శశినేవ నిశీథినీ ।
యౌవనేనేవ వనితా నయేన శ్రీర్మనోహరా ॥

సరస్సు కమలములచేత మనోహరమైనట్లును, రాత్రి చంద్రునిచే మనోహరమైనట్లును, స్త్రీ యౌవనముచే మనోహరమైనట్లును ఐశ్వర్యము న్యాయముచే మనోహర మగుచున్నది.

### 114 పరోపకారము

దానం విత్తాదృతం వాచః కీర్తిధర్మౌ తథాయుషః ।
పరోపకరణం కాయా దసారా త్సార మాహరేత్ ॥

ధనము నుండి దానమును, వాక్కు నుండి సత్యమును, ఆయుస్సు నుండి కీర్తిధర్మములను, శరీరము నుండి పరోపకారమును ఇట్లు అసార మయిన వాని నుండి సారమును గ్రహించ వలెను.

### 115 అనురాగము

శ్రుతం కృతధియాం సంగాజ్జాయతే వినయః శ్రుతాత్ ।
లోకానురాగో వినయాన్న కిం లోకానురాగతః॥

పండితుల సంగమువలన విద్యలభించును. విద్య వలన వినయము లభించును. వినయము వలన లోకానురాగము లభించును. లోకానురాగము వలన యేమి లభింపదు.

### 116 ధ్యానము

కిమారాధ్యం సదా పుణ్యం కశ్చ సేవ్యః సదాగమః ।
కో ధ్యేయో భగవాన్విష్ణుః కిం కామ్యం పరమం పదమ్॥

ఎల్లప్పుడును పుణ్యమును ఆరాధింపవలెను. ఎల్లప్పుడును జ్ఞానమును సేవింపవలెను. ఎల్లప్పుడును విష్ణువును ధ్యానించవలెను. ఎల్లప్పుడును పరమ పదమును కోరవలెను.

### 117 ధ్యానము

ఏకామిషాభిలాషా హి బీజం వైరమహాతరోః
తిలోత్తమాభిలాషో హి యథా సుందోపసుందయోః॥

వైరమను వృక్షమునకు ఒకే వస్తువును ఇరువురు అభిలషించుటయే బీజము. సుందోపసుందుల వైరమునకు తిలోత్తమాభిలాషయే కారణము.

118 దుఃఖానంతరసుఖము

వ్యసనానన్తరం సౌఖ్యం స్వల్పమప్యధికం భవేత్ ।
కాషాయరస మాస్వాద్య స్వాద్వతీవాంబు విందతే॥

దుఃఖానంతరము స్వల్పమైన సుఖమైనను, అధికముగా తోచును. చేదును తినిన తరువాత నీరుకూడ తీయగా నున్నట్లుండును.

119 సాధు దూషణము

నిందాం యః కురుతే సాధో స్తథా స్వం దూషయత్యసౌ ।
ఖే భూతిం య స్త్యజేదుచ్చై ర్మూర్ధ్ని తస్యైవ సా పతేత్ ॥

సాధువును యెవడైతే నిందించునో వాడు తననే దూషించు కొనును. ఆకాశములోనికి యెవడైనను బుగ్గిని ఎగరవేయుచో అది అతని తల మీాదనే పడును.

120 కాలము

శుభం వాప్యశుభం కర్మ ఫలకాల మపేక్షతే।
శరద్యేవ ఫలత్యాశు శాలిర్న సురభౌ క్వచిత్ ॥

శుభమైన కర్మయైనను అశుభమైన కర్మయైనను ఫలకాలమును అపేక్షించుచుండును. వరి శరత్కాలమునందే వేగిరము ఫలించును కాని చైత్రమాసమున నెప్పుడును ఫలించదు.

121 సమీపస్థులు

నికటస్థం గరీయాంసమపి లోకో న మన్యతే ।
పవిత్రామపి యన్మర్త్యా న నమస్యన్తి జాహ్నవీమ్ ॥

గొప్పవాడైనప్పటికిని సమీపమున నున్నవానిని లోకము మన్నించదు. పవిత్రమైన దైనప్పటికిని గంగానదికి ఆ ప్రాంతమున నివసించువారు నమస్కరించరు కదా.

122 సంతోషము

సంతుష్యత్యుత్తమః స్తుత్యా ధనేన మహతాధమః ।
ప్రసీదన్తి జపైర్దేవా బలిభిర్భూతవిగ్రహాః ॥

ఉత్తముడు స్తోత్రముచే సంతోషమును పొందును. అధముడు విశేషధనముచే సంతోషమును పొందును. జపములచే దేవతలు దయ కలవారగుదురు. భూత విగ్రహములు బలులచే దయ కలవగును.

123 వినాశ హేతువులు

అనుచిత కర్మారంభః స్వజనవిరోధో బలీయసా స్పర్ధా ।
ప్రమదాజన విశ్వాసో మృత్యుద్వారాణి చత్వారి ॥

తగనికర్మను చేయ నారంభించుట, స్వజనులతో విరోధము, బలవంతులతో స్పర్ధ, స్త్రీలను నమ్మట – యీ నాలుగును మృత్యువునకు ద్వారములు.

124 అధికారి

ప్రాప్యచలానధికారాన్ శత్రుషు మిత్రేషు బంధువర్గేషు ।
నాపకృతం నోపకృతం న సత్కృతం కిం కృతం తేన ॥

అస్థిరములైన అధికారములను పొంది, శత్రువులకు అపకారము, మిత్రులకు ఉపకారము, బంధువులకు సత్కారము చేయనివాడు యేమి చేసినట్లు?

### 125 కౌశల పరీక్ష

ఆపరితోషాద్విదుషాం నసాధు మన్యే ప్రయోగవిజ్ఞానం ।
బలవదపి శిక్షితానా మాత్మన్యప్రత్యయం చేతః ।।

పండితులు సంతోషించు వరకును, తన విజ్ఞానము పరిపూర్ణమని భావింపరాదు. బాగుగా శిక్షణ పొందినవారికి: గూడ తమశక్తిలో తమకు నమ్మక ముండదు.

### 126 శక్తి

జ్వలతి చలితేంధనోగ్ని ర్వి ప్రకృతః పన్నగః ఫణాం కురుతే ।
ప్రాయః స్వం మహిమానం క్షోభాత్ప్రతిపద్యతే జన్తుః॥

కట్టెలను ఎగద్రోసి నప్పుడే అగ్ని జ్వలించును. బాధ పెట్ట బడి నప్పుడే పాము పడగను విప్పును. సాధారణముగా క్షోభకలిగినప్పడే జంతువు తన శక్తిని ప్రకటించును.

### 127 బ్రహ్మవ్రాత

అలిరనుసరతి పరిమలం లక్ష్మీరనుసరతి నయగుణసమృద్ధిమ్ ।
నిమ్నమనుసరతి సలిలం విధిలిఖితం బుద్ధిరనుసరతి॥

తుమ్మెద పరిమళము ననుసరించును. లక్ష్మి మంచి గుణ సమృద్ధిని అనుసరించును. నీరు పల్లము ననుసరించును.. బుద్ధి బ్రహ్మదేవుని వ్రాతననుసరించును.

### 126 జారత్వము

స్వాధీనేఽపి కలత్రే నీచః పరదారలంపటో భవతి ।
సంపూర్ణేఽపి తడాగే కాకః కుంభోదకం పిబతి॥

భార్య స్వాధీనురాలైనను, నీచుడు పరస్త్రీ లంపటు డగును చెరువు నీటితో నిండి యున్నను, కాకి కడవనీళ్లనే త్రాగును.

129 భార్య

అనుకూలాం విమలాంగీం కులజాం కుశలాం సుశీలసంపన్నాం।
పంచలకారాం భార్యాం పురుషః పుణ్యోదయాల్లభతే॥

అనుకూలవతి సుందరాంగి, మంచికులమున పుట్టినది, నేర్పరి, మంచి స్వభావము కలది ఇట్టి యైదు గుణములతో గూడిన భార్యను పురుషుడు పుణ్యమువల్ల పొందును.

130 నిజమైన ఐశ్వర్యము

ఆరోగ్యం విద్వత్తా సజ్జనమైత్రీ మహాకులే జన్మ ।
స్వాధీనతా చ పుంసాం మహదైశ్వర్యం వినాప్యర్థైః॥

ఆరోగ్యము, పాండిత్యము, సజ్జన స్నేహము, మంచి కులములో పుట్టుట, పరాధీనత లేకుండుట–ధనము లేకపోయి నను ఇవియుండుట గొప్ప యైశ్వర్యము.

131 బుద్ధి

యః పఠతి లిఖతి పశ్యతి పరిపృచ్ఛతి పండితా నుపాశ్రయతి
తస్య దివాకర కిరణై ర్నలినీదలమివ వికాస్యతే బుద్ధిః॥

ఎవడు చదువునో, వ్రాయునో, చూచునో, ప్రశ్నించునో, పండితుల నాశ్రయించునో, అతనికి సూర్య కిరణములచే పద్మదళములు వికసించునట్లు బుద్ధి వికసించును.

132 గుణవంతులు

విరలా జానన్తి గుణాన్విరలాః కుర్వంతి నిర్ధనే స్నేహమ్।
విరలాః పరకార్యరతాః పరదుఃఖేనాపి దుఃఖితా విరలాః॥

గుణములను గ్రహించువారు అరుదు. ధనహీనులతో స్నేహము చేయువారు అరుదురు. ఇతరుల కార్యములయం దాసక్తికలవారు అరుదు. ఇతరుల దుఃఖమున దుఃఖించు వారు అరుదు.

133 గ్రుడ్డివాడు, చెవిటివాడు, మూగవాడు

కోఽన్ధో యోఽకార్యరతః కో బధిరో యః శృణోతి నహితాని।
కో మూకో యః కాలే ప్రియాణి వక్తుం న జానాతి॥

అకార్యము చేయుటయం దాసక్తి గలవాఁడు గ్రుడ్డి వాఁడు. మంచిమాట వినని వాఁడు చెవిటివాఁడు. అవసరమై నప్పుడు ప్రియమును పలుక నేరని వాఁడు మూగివాఁడు.

134 ఆసక్తి

కుత్ర విధేయో యత్నో విద్యాభ్యాసే సదౌషధే దానే।
అవధీరణా క్వ కార్యా ఖలపరయోషిత్పరధనేషు॥

విద్యాభ్యాసము కొరకు మంచి యౌషధము కొరకు దానము కొరకు యత్నము చేయవలయును. దుష్టులయందు పరస్త్రీలయందు, పరధనమునందు అనాదరణము చూపవలయును.

135 వసతి

కుత్ర విధేయో వాసః సజ్జనకంఠే యథా కాశ్యామ్ ।
కః పరిహార్యో దేశః పిశునయుతో లుబ్ధ భూపశ్చ॥

ఎచ్చట నివసింపవలెను? కాశీయందు నివసించు నట్లుగా సజ్జనుల పొరుగునందు నివసింపవలెను. ఏ దేశము విడువవలెను? లోభియగు రాజుగల దేశమును విడచు నట్లుగా కొండెములు చెప్పు జనులు గల దేశమును విడువ వలెను.

136 మనస్సు

దధి మధురం మధు మధురం
ద్రాక్షా మధురా సుధాపి మధురైవ ।
తస్య తదేవ హి మధురం
యస్య మనో యత్ర సంలగ్నమ్ ॥

పెరుగు తీపి; తేనెతీపి; ద్రాక్షతీపి; అమృతము తీపి. ఎవని మనస్సు దేనియందు లగ్నమగునో వాని కదియే తీపి.

137 పాండిత్యము

కో ధర్మో భూతదయా కిం సౌఖ్య మరోగితా జగతి ।
కః స్నేహః సద్భావః కిం పాండిత్యం పరిచ్ఛేదః ॥

ఏది ధర్మము? భూతదయ. ఏది సౌఖ్యము? రోగము లేకుండుట. ఏది స్నేహము? మంచితనము. ఏది పాండిత్యము నిర్ణయము చేయ గలుగుట.

### 138 అదృష్టములు

దానం ప్రియవాక్సహితం
జ్ఞాన మగర్వం క్షమాన్వితం శౌర్యమ్ ।
విత్తం త్యాగనియుక్తం
దుర్లభ మేత చ్చతు ర్భద్రమ్ ॥

ప్రియవాక్కుతో కూడిన దానము, గర్వము లేని జ్ఞానము, ఓరిమితో కూడిన శౌర్యము, దానమందుపయుక్తమైన ధనము - ఈనాలుగు అదృష్టములు దుర్లభములు.

### 139 మూర్ఖత

కృతశత మసత్సు నష్టం సుభాషితశతం చ నష్ట మబుధేషు।
వచన శత మవచనకరే బుద్ధిశత మచేతనే నష్టమ్ ॥

సత్పురుషులు కానివారికి నూరు మంచిపనులు చేసినను వ్యర్థము. బుద్ధి లేనివారికి నూరు సుభాషితములు వ్యర్థము. చెప్పినట్లు చేయనివారికి నూరు మాటలు చెప్పినను వ్యర్థము. జడులకు నూరు బుద్ధులు బోధించినను వ్యర్థము.

### 140 శక్తి

అప్రకటీకృతశక్తిః శక్తోఽపి జనస్తిరస్క్రియాం లభతే ।
నివసన్నంతర్దారుణి లంఘ్యో వహ్నిర్నతు జ్వలితః ॥

తన శక్తిని చూపని వాడు సమర్థుడైనను అవమానమును పొందును. కర్రయందు ఇమిడియున్న నిప్పు మండనప్పుడు సులభముగా దాటబడును గదా.

141 ఒంటెబ్రతుకు

విషమస్థస్వాదుఫలగ్రహణవ్యవసాయనిశ్చయో యేషామ్ ।
ఉష్ట్రాణామివ తేషాం మన్యేహం శంసితం జన్మ ॥

ప్రవేశించుటకు కష్టమైన స్థలమునందున్న ఫలమును సంపాదించవలయునను నిశ్చయము కలవారి జన్మము, ఒంటెల జీవనమువలె ప్రశంసనీయము.

142 నటన

అసతీ భవతి సలజ్జా క్షారం నీరం చ శీతలం భవతి ।
దంభో భవతి వివేకీ ప్రియవక్తా భవతి ధూర్తజనః ॥

వ్యభిచారిణి సిగ్గును చూపును. ఉప్పునీరు చల్లగా నుండును. దంభము కలవాడు వివేకమును చూపును. దుర్జనుడు ప్రియమును పలుకుచుండును.

143 సాహచర్యము

స్త్రీణాం హి సాహచర్యాద్భవంతి చేతాంసి భర్తృసదృశాని।
మధురాపి హి మూర్ఛయతే విషవిటపిసమాశ్రితా వల్లీ॥

ఎల్లప్పుడు కలిసి యుండుటచే స్త్రీల హృదయములు భర్తల హృదయములతో సదృశము లగును. మంచిది యైనను విషపు కొమ్మను చుట్టుకొనిన తీగ మూర్ఛను పొందించును.

144 నేర్పు

సకృదపి దృష్ట్వా పురుషం విబుధా జానన్తి సారతాం తస్య ।
హస్తతులయాపి నిపుణాః ఫలప్రమాణం విజానన్తి ॥

బుద్ధిమంతులు ఒక్కమారు చూచినను పురుషుని సార మును తెలిసికొందురు. నేర్పు గలవారు చేతితో యెత్తి కూడ తూనికను తెలిసికొందురు.

### 145 స్నేహము

ఉపచారః కర్తవ్యో యావదనుత్పన్నసౌహృదాః పురుషాః।
ఉత్పన్నసౌహృదానా ముపచారః కైతవం భవతి॥

స్నేహము కలుగువరకును మరియాద చేయవలయును. స్నేహము కలిగిన తరువాత చేయబడిన మరియాద దొంగ మరియాద యనిపించుకొనును.

### 146 స్నేహము

స్నేహో హి వర మఘటితో న వరం సంజాతవిఘటితస్నేహః।
హృతనయనో హి విషాదీ న విషాదీ భవతి జాత్యంధః॥

స్నేహము కలుగకుండిన మంచిది కాని, కలిగి విడుట మంచిదికాదు. కొన్ని దినములు కళ్లను కలిగియుండి గ్రుడ్డి వైన వాడు విచారించును కాని, పుట్టుగ్రుడ్డి విచారింపడు.

### 147 సజ్జనులు

నలినీదలగత జలవత్తరలం కిం యౌవనం ధనం చాయుః।
కే శశధరకిరనికరానుకారిణః సజ్జనా ఏవ॥

తామరాకు మీద నీటిబిందువుల వలె చంచలములైన వేవి? యౌవనము, ధనము, ఆయుస్సు, చంద్రకిరణముల వలె చల్లగా నుండు వారెవరు? సజ్జనులు మాత్రమే.

148 ముఖస్తుతి

వితరతి యావద్దాతా తావ త్సకలోఽపి భవతి కలభాషీ ।
విరతే పయసి ఘనేభ్యః శామ్యన్తి శిఖండినాం ధ్వనయః॥

దాత యెంతవరకు ధనము నిచ్చుచుండునో అంత వరకు నందరును స్తోత్రము చేయుచుందురు. మేఘములలో నీరు చెల్లిపోగా నెమలి కేకలు నిలిచిపోవును.

149 పరీక్ష

వ్యసనే మిత్ర పరీక్షా శూరపరీక్షా రణాంగణే భవతి ।
వినయే భృత్య పరీక్షా దానపరీక్షా చ దుర్భిక్షే॥

స్నేహితునికి పరీక్ష కష్టము వచ్చినప్పుడు జరుగును. శూరునికి పరీక్ష యుద్ధభూమియందు జరుగును. సేవకునికి పరీక్ష వినయమునందు జరుగును. దానమునకు పరీక్ష దుర్భిక్షమునందు జరుగును.

150 దోషదృష్టి

నిజదోషావృతమనసాం అతిసుందరమేవ భాతి విపరీతమ్ ।
పశ్యతి పిత్తోపహతః శశిశుభ్రం శంఖమపి పీతమ్ ॥

తమ దోషము చేత ఆవరించబడిన మనస్సుకలవారికి మిక్కిలి సుందరమైన వస్తువుకూడ విపరీతముగా కనిపించును. పిత్తదోషము కలవానికి శంఖము తెల్లగానున్నను పసుపుగా కనబడును.

151 నిదానము

స్వవశః కరోతి కర్మ ప్రమాదయుక్తస్తు పరవశో భవతి ।
స్వవశో రోహతి వృక్షం నిపతత్యవశ స్తతః పురుషః ॥

స్వవశుడైన వాడు యేకర్మనైనను బాగుగాజేయును. పరవశుడు పొరపాటు పడుచుండును. స్వవశుడైన వాడు చెట్టునెక్కును. పరవశుడైన వాడు చెట్టునుండి క్రింద పడును.

152 స్వబుద్ధి

సర్వథా స్వహిత మాచరణీయం కిం కరిష్యతిజనో బహుజల్పః।
విద్యతే న హి స కశ్చిదుపాయః సర్వలోకపరితోషకరో యః॥

సర్వవిధముల తన హితమును చేసికొన వలయును. అధికముగా మాటలాడు జను లేమి చేయగలరు? సమస్త జనులకు తృప్తి కలిగించు నుపాయ మేదియును లేదు కదా!

153 దొంగతనము

కస్యచిత్కిమపి నో హరణీయం
మర్మవాక్యమపి నోచ్చరణీయమ్ ।
శ్రీపతేః పదయుగం స్మరణీయం
లీలయా భవజలం తరణీయమ్॥

ఎవ్వని వస్తువును దొంగిలింప కూడదు. ఇతరులకు బాధకలిగించు వాక్యము పైకి చెప్ప కూడదు. శ్రీపతి పద ద్వయమును స్మరించవలెను. లీలగా సంసారజలమును దాట వలయును.

154 చిత్తశుద్ధి

ఆసురం కుల మనాదరణీయం చిత్త మేత దమలీకరణీయమ్ ।
రామధామ శరణీకరణీయం లీలయా భవజలం తరణీయమ్ ॥

రాక్షస కులమును ఆదరించగూడదు. చిత్తమును శుద్ధము చేసికొనవలయును. రామాలయమును శరణముగా జేసికొనవలెను. లీలగా సంసార జలమును దాటవలయును.

155 పరహాని

యః పరస్య విషమం విచిన్తయే
త్తాప్నుయాత్స కుమతిః స్వయంహితత్ ।
పూతనా హరివధార్థమాయయా
ప్రాప సైవ వధమాత్మన స్తతః॥

పరునికి హానిని చింతించు దుర్బుద్ధి తానే హానిని పొందును. పూతన హరిని చంపుటకు వచ్చెను. అతని వల్లనే ఆమె మృతిని పొందెను.

156 జూదము

కాకే శౌచం ద్యూతకారే చ సత్యం
సర్పేక్షాన్తిః స్త్రీషు కామోపశాన్తిః
క్లీబే ధైర్యం మద్యపే తత్త్వచిన్తా
రాజ్ఞో మిత్రం కేన దృష్టం శ్రుతంవా॥

కాకి యందు శుభ్రత, జూదగాని యందు సత్యము, పామునకు ఓర్మి, స్త్రీలకు కామోపశాంతి, నపుంసకునకు ధైర్యము, త్రాగుబోతునకు తత్త్వచింత, రాజునకు స్నేహితుడు – వీనిని ఎవడును కని విని యెరుగడు.

### 157 ఏకదృష్టి

ఏకో దేవః కేశవో వా శివో వా
ఏకం మిత్రం భూపతిర్వా యతిర్వా ।
ఏకా భార్యా సుందరీవా దరీవా
ఏకో వాసః పత్తనేవా వనేవా ॥

కేశవుడు గాని, శివుడు గాని ఒక్కడే దేవుడు. రాజు గాని, సన్యాసి గాని ఒక్కడే మిత్రుడు. సుందరియైన భార్య గాని, కొండగుహ కాని ఒక్కటే ఆదరణీయము. పట్టణమందు గాని. వనమునందు గాని ఒక్కచోటనే నివాసము.

### 158 చిత్తశుద్ధి

చిత్తాయత్తం ధాతుబద్ధం శరీరం
నష్టే చిత్తే ధాతవో యాన్తి నాశమ్ ।
తస్మాచ్చిత్తం సర్వదా రక్షణీయం
స్వస్థే చిత్తే బుద్ధయః సంభవన్తి ॥

ధాతువులతో కట్టబడిన శరీరము చిత్తమునకు వశమై యున్నది. చిత్తము నష్టమైనచో ధాతువులు నాశమును పొందును. కాబట్టి చిత్తమును సర్వదా రక్షించవలెను. చిత్తము స్వస్థముగా నున్నచో బుద్ధి వికసించును.

### 159 మూఢుడు

శాఠ్యేన ధర్మం కపటేన మిత్రం
పరోపతాపేన సమృద్ధిభావమ్ ।
సుఖేన విద్యాం పరుషేణ నారీం
వాంఛన్తి యే వ్యక్త మపండితాస్తే ॥

మోసముచే ధర్మమును, కపటముచే స్నేహితుని, పరులను హింసించుటచే స్వలాభమును, సుఖముచే విద్యను, పారుష్యముచే స్త్రీని, సంపాదింపగోరు వారు నిశ్చయముగా బుద్ధి లేనివారు.

### 160 సుగుణములు

దానం దరిద్రస్య ప్రభోశ్చ శాన్తి
ర్యూనాం తపో జ్ఞానవతాం చ మౌనమ్ ।
ఇచ్ఛానివృత్తిశ్చ సుఖాన్వితానాం
దయా చ భూతేషు దివం నయన్తి ॥

దరిద్రుని దానము, రాజుగారి శాంతము, యౌవనములో నున్న వారి తపస్సు, జ్ఞానవంతుల మౌనము, సుఖముగా నున్నవారికి కోరికలు లేకుండుట, భూతముల యందు దయయు – స్వర్గమునకు గొనిపోవును.

### 161 ఆరుసుఖములు

ఆరోగ్య మానృణ్య మవిప్రవాసః
సత్ప్రత్యయా వృత్తి రభీతివాసః ।
సద్భిర్మనుష్యైః సహసంప్రయోగః
షడ్జీవలోకస్య సుఖాని రాజన్ ॥

ఆరోగ్యము, ఋణము లేకపోవుట, దూరదేశ వాసము లేకుండుట, నమ్మకమైన వృత్తి, భయములేని జీవనము, సత్పురుషులతో సంబంధము – ఈ యారును జీవలోకమునకు సుఖములు.

### 162 సజ్జనమైత్రి, దుర్జనమైత్రి

ఆరంభగుర్వీ క్షయిణీ క్రమేణ
లఘ్వీ పురా వృద్ధిమతీ చ పశ్చాత్ ।
దినస్య పూర్వార్ధ పరార్ధ భిన్నా
ఛాయేవ మైత్రీ ఖల సజ్జనానామ్॥

దినమున పూర్వాహ్ణమునందు నీడవలె దుష్టులతో స్నేహము ప్రారంభమున అధికముగా నుండును; క్రమక్రమముగా తగ్గును. దినమున అపరాహ్ణమునందు నీడవలె సజ్జనులతో స్నేహము ప్రారంభమున కొద్దిగా నుండును; క్రమముగా నధికమగును.

### 163 ఋణశేషము

భార్యావియోగః స్వజనాపవాదో
ఋణస్య శేషం కృపణస్య సేవా
దారిద్ర్యకాలే ప్రియదర్శనం చ
వినాగ్నినా పంచ దహన్తి కాయమ్॥

భార్యావియోగము, బంధువులలో నింద, ఋణశేషము, లోభికి సేవ చేయుట, దారిద్ర్యము సంభవించునప్పుడు స్నేహితుల దర్శనము – ఈయైదును అగ్ని అక్కరలేకయే శరీరమును కాల్చివేయును.

### 164 నిరర్థకత

కిం పౌరుషం రక్షతి యో న వార్తా
న్కిం వా ధనం నార్థిజనాయ యత్స్యాత్ ।
సా కిం క్రియా యా న హితానుబద్ధా
కిం జీవితం సాధువిరోధి యద్వై॥

ఆర్తులను రక్షించని పౌరుషము ఏమిపౌరుషము ? అర్థించినవారికి యివ్వని ధనము ఏమి ధనము ? హితముతో కూడుకొనని పని యేమి పని ? సాధువులతో విరోధించు జీవితము ఏమి జీవితము ?

### 165 కార్యకౌశలము

శాస్త్రేషు నిష్ఠా సహజశ్చ బోధః
ప్రాగల్భ్య మభ్యస్తగుణా చ వాణీ।
కాలానురోధః ప్రతిభానవత్వ
మేతేగుణాః కామదుఘాః క్రియాసు॥

శాస్త్రముల యందు నమ్మకము, సహజమైన జ్ఞానము, ధైర్యము, బాగుగానభ్యసింపబడిన వాక్కు, సమయానుసరణము, ప్రతిభ - యీగుణములు పనులుచేయుటయందు కామధేనువు వంటివి.

### 166 మంచితనము

న కస్యచి త్కశ్చి దిహ స్వభావా
ద్భవత్యుదారోఽభిమతః ఖలోవా।
లోకే గురుత్వం విపరీతతాం వా
స్వచేష్టితాన్యేవ నరం నయన్తి॥

ఈ లోకమున ఎవ్వడును, ఎవ్వనికిని, స్వభావమువల్లనే గొప్పవాడుగాని, దుర్మార్గుడుగాని, కాడు. మనుష్యునికి గొప్పతనము గాని, చిన్నతనము గాని ఆతని పనుల వలననే కలుగును.

## 167 రహస్యము

దారేషు కించి త్స్వజనేషు కించి
ద్గోప్యం వయస్యేషు సుతేషు కించిత్ ।
యుక్తం న వా యుక్త మిదం విచిన్త్య
వదే ద్విపశ్చి న్మహతోఽనురోధాత్ ॥

కొన్ని విషయములు భార్యకు చెప్పక, కొన్ని బంధువులకు చెప్పక, కొన్ని స్నేహితులకు చెప్పక, కొన్ని కుమారులకు చెప్పక, దాచవలసి యుండును. ఏది యుక్తమో, ఏది అయుక్తమో విచారించి, బుద్ధిమంతుడు పెద్దల మార్గము ననుసరించి ప్రవర్తించ వలసి యుండును.

## 168 స్నేహము

మృగా మృగైః సంగ మనువ్రజన్తి
గావశ్చ గోభి స్తురగా స్తురంగైః ।
మూర్ఖాశ్చ మూర్ఖైః సుధియః సుధీభిః
సమాన శీలవ్యసనేషు సఖ్యమ్॥

మృగములు మృగములతో కలియును. గోవులు గోవులతో కలియును. గుఱ్ఱములు గుఱ్ఱములతో కలియును. మూర్ఖులు మూర్ఖులతో కలియుదురు. బుద్ధిమంతులు బుద్ధిమంతులతో కలియుదురు. గుణ దోషములలో సమానత్వము కలవారికే సఖ్యము కలుగును.

## 169 ధైర్యము

త్యాజ్యం న ధైర్యం విధురేఽపి కాలే
ధైర్యాత్కదాచి ద్గతిమాప్నుయాత్సః ।
యథా సముద్రేఽపి చ పోతభంగే
సాంయాత్రికో వాంఛతి తర్తుమేవ।

కష్టకాలమున గూడ ధైర్యమును విడువరాదు. ధైర్యమువలన నొకప్పుడు తప్పించుకొనుటకు మార్గము తోచవచ్చును. సముద్రమున పడవ పగిలినప్పుడు కూడ సముద్రవ్యాపారి తప్పించుకొనుటకే కోరును గదా!

## 170 సంతోషము

దానేన తుల్యో విధిరస్తి నాన్యో
లోభాచ్చ నాన్యోఽస్తి పరః పృథివ్యామ్ ।
విభూషణం శీలసమం న చాన్య
త్సంతోషతుల్యం ధనమస్తి నాన్యత్॥

దానముతో సమానమైన పని మరియొకటి లేదు. లోభము కంటె నీచమైనది మరియొకటి లేదు. మంచి ప్రవర్తనతో సమానమైన మరియొక యలంకారము లేదు. సంతోషముతో సమానమైన ధనము మరియొకటి లేదు.

## 171 అనర్థములు

క్షతే ప్రహారా నిపతన్త్యభీక్ష్ణం ధనక్షయే వర్ధతి జాఠరాగ్నిః।
ఆపత్సు వైరాణి సముద్భవన్తి ఛిద్రేష్వనర్థా బహులీభవన్తి॥

గాయము మీదనే విశేషముగా దెబ్బలు తగులు చుండును. ధనము తగ్గగా ఆకలి అధికమగును. ఆపదలు కలుగగా వైరములు ప్రారంభమగును. లోపములు కలిగి నప్పుడే అనర్థములు హెచ్చుగు చుండును.

172 ధనాశ

అర్థాతురాణాం న గురుర్న బంధుః
కామాతురాణాం న భయం న లజ్జా।
విద్యాతురాణాం న సుఖం న నిద్రా
క్షుధాతురాణాం న రుచిర్న వేలా॥

ధనమునందు (హెచ్చు) ఆశగలవారికి గురువు లక్ష్యము, బంధువుల లక్ష్యము ఉండవు. కామమునందు (హెచ్చు) ఆశగలవారికి భయము, లజ్జయు నుండవు. విద్యయందు (హెచ్చు) ఆసక్తి కలవారికి సుఖము, నిద్రయు నుండవు. ఆకలిచే (హెచ్చు) బాధపడుచున్నవారికి, రుచియు వేళయు నుండవు.

173 గుణములు

యత్రాస్తి లక్ష్మీర్వినయో న తత్ర
అభ్యాగతో యత్ర న తత్ర లక్ష్మీః।
ఉభౌ చ తౌ యత్ర న తత్ర విద్యా
నైకత్ర సర్వో గుణసంనిపాతః॥

ఐశ్వర్య మున్నచోట వినయ ముండదు. అతిథులు అధికముగా నున్నచోట ఐశ్వర్య ముండదు. పై రెండును

నుండు స్థలములలో విద్య యుండదు. గుణము లన్నిటి చేరికయు నొక చోట నుండదు.

174 సన్మార్గము

శ్రుతిర్విభిన్నా స్మృతయశ్చ భిన్నా
నైకో ముని ర్యస్య వచోఽప్రమాణమ్ ।
ధర్మస్య తత్త్వం నిహితం గుహాయాం
మహాజనో యేనగతః సపంథాః॥

వేదములు విభిన్నముగానున్నవి. స్మృతులు విభిన్నముగా నున్నవి. ఏమునియొక్క వాక్యమున్ను అప్రమాణము కాదు. ధర్మముయొక్క తత్త్వము అతిగూఢముగా నున్నది. కావున, మహాజనులు పోయిన మార్గమునే అందరును ఆశ్రయించ వలెను.

175 దానమహిమ

సుపాత్రదానాచ్చ భవేద్ధనాఢ్యో
ధనప్రభావేణ కరోతి పుణ్యమ్ ।
పుణ్యప్రభావా త్సురలోకవాసీ
పునర్ధనాఢ్యః పునరేవభోగీ॥

తగినవారికి దానముచేయుటవలన ధనవంతుడగును. ధనప్రభావము వలన పుణ్యమును చేయును. పుణ్యముయొక్క ప్రభావమువలన స్వర్గనివాసమును పొందును. తిరిగి ధనవంతుడగును. తిరిగి భోగముల ననుభవించును.

### 176 అపాత్రదానము

అపాత్రదానాచ్చ భవేద్దరిద్రో
దారిద్ర్యదోషేణ కరోతి పాపమ్ ।
పాపప్రభావా న్నరకం ప్రయాతి
పునర్దరిద్రః పునరేవ పాపీ ॥

తగనివారికి దానము చేయుట వలన దరిద్రుడగును. దారిద్ర్యదోషముచే పాపమును చేయును. పాపముయొక్క ప్రభావము వలన నరకమునకు పోవును. తిరిగి దరిద్రుడగును. తిరిగి పాపియగును.

### 177 విద్య

నిరక్షరే వీక్ష్య మహాధనత్వం
విద్యానవద్యా విదుషా న హేయా ।
రత్నావతంసాః కులటాః సమీక్ష్య
కిమార్యనార్యః కులటాభవన్తి ॥

విద్యలేనివారు ధనవంతులుగా నుండుటను చూచి పండితులు విద్యను త్యజించగూడదు. రత్నములతో నలంకరించుకొనిన జారస్త్రీలను చూచి కులకాంతలు జారస్త్రీలగుదురా ?

### 178 గుణగ్రహణము

న వేత్తి యో యస్య గుణప్రకర్షం
సతం సదా నిందతి నాత్ర చిత్రమ్ ।
యథా కిరాతీ కరికుంభజాతాం
ముక్తాం పరిత్యజ్య బిభర్తి గుంజామ్ ॥

ఒకరి గుణాధిక్యమును నెరుంగనివాడు అతని నెల్లప్పు డును నిందించును. అది చిత్రముకాదు. ఏమనిన, కిరాతస్త్రీ యేనుగుకుంభస్థలమందు పుట్టిన ముత్యములనువిడిచి గురివెంద పూసల్లను ధరించును!

179 మైత్రి

గిరౌ మయూరా గగనే పయోదా
లక్షాన్తరేఽర్కశ్చ జలేషు పద్మమ్ ।
ఇందుర్ద్విలక్షం కుముదస్య బంధు
ర్యోయస్య మిత్రం నహితస్య దూరమ్॥

కొండయందు నెమళ్లు, ఆకాశమునందు మేఘమునకు స్నేహితులు. లక్ష (యోజనముల) దూరమునగల సూర్యుడు జలమున గల పద్మములకు మిత్రుడు. రెండు లక్షల (యోజనముల) దూరమున నున్న చంద్రుడు* కలువలకు బంధువు. స్నేహితులకు దూర మెక్కడిది ?

190 జితేంద్రియత్వము

జితేంద్రియత్వం వినయస్య కారణం
గుణ ప్రకర్షో వినయా దవాప్యతే ।
గుణాధికే పుంసి జనోఽనురజ్యతే
జనానురాగః ప్రభవో హి సంపదః ॥

జితేంద్రియత్వము వినయమునకు కారణము. వినయము వలన గుణము లధికమగును. గుణాధికుడైన పురుషుని యందు జనులు ప్రేమను కలిగి యుందురు. జనానురాగము సంపదలకు కారణము.

---

* నిజమునకు – భూమికి చంద్రుడు సూర్యునికన్న దగ్గర

### 181 విద్వాంసుడు

సంపూర్ణకుంభో న కరోతి శబ్ద
మర్ధో ఘటో ఘోషముపైతి నూనమ్ ।
విద్వాన్కులీనో న కరోతి గర్వం
గుణైర్విహీనా బహు జల్పయంతి॥

నిండుకుండ శబ్దము చేయదు. సగము నిండినకుండ శబ్దమును చేయును. మంచి కులము నందు పుట్టిన విద్వాంసుడు గర్వమును పొందడు. గుణరహితులైన వారు విశేషముగా ప్రేలుదురు.

### 182 కార్యసాధన

త్రివిక్రమోఽభూదపి వామనోఽసౌ
స సూకరశ్చేతి సవై నృసింహః ।
నీచై రనీచై రతినీచ నీచైః
సర్వైరుపాయైః ఫలమేవసాధ్యమ్॥

వామను డయినప్పటికిని త్రివిక్రము డయ్యెను. ఆతడే పందియయ్యెను. ఆతడే సింహమయ్యెను. నీచమైనట్టియు, నీచము కానట్టియు, అతి నీచమైనట్టియు అన్ని యుపాయముల చేతను ఫలమునే సాధించవలెను.

### 183 కోపము

క్రోధో హి శత్రుః ప్రథమో నరాణాం
దేహస్థితో దేహవినాశనాయ ।
యథా స్థితః కాష్ఠగతో హి వహ్నిః
స ఏవ వహ్నిర్దహతే శరీరమ్॥

కట్టెయందు ఇమిడియున్న నిప్పు కట్టెనే కాల్చునట్లు దేహము నందుండు కోపమే దేహమును నాశము చేయుటకు మనుష్యులకు మొదటి శత్రువు.

## 184 సత్సాంగత్య మహిమ

యతీ వ్రతీ చాపి పతివ్రతాశ్చ
వీరాశ్చ శూరాశ్చ దయాపరాశ్చ ।
త్యాగీ చ భోగీ చ బహుశ్రుతాశ్చ
స్వసంగమాత్రేణ దహన్తిపాపమ్॥

సన్యాసి, వ్రతముల నాచరించు వాడు, పతివ్రతలు, వీరులు, శూరులు, దయావంతులు, దానశీలురు, భోగి, పండితులు – వీరు సాంగత్య మాత్రముననే పాపములను పోగొట్టుదురు.

## 185 సత్యము

న సా సభా యత్ర న సన్తి వృద్ధా
వృద్ధా న తే యే న వదంతి ధర్మమ్ ।
ధర్మో న వై యత్ర చ నాస్తి సత్యం
సత్యం న తద్యచ్ఛల నాను విద్ధమ్॥

వృద్ధులు లేనిది సభ యనిపించుకొనదు. ధర్మమును బోధించనివారు వృద్ధు లనిపించుకొనరు. సత్యము లేనిది ధర్మ మనిపించుకొనదు. మోసముతో గూడినది సత్య మనిపించు కొనదు.

186 మూర్ఖత

స్థితో న ఖాదామి హసన్న జల్పే
గతం న శోచామి కృతం న మన్యే।
ద్వయోస్తృతీయో న భవామి రాజ
న్కేనాస్మి మూర్ఖో వద కారణేన॥

నిలువబడి దేనిని తినను. నవ్వుచు మాటలాడను. జరిగి పోయిన దానిని గురించి విచారింపను. చేసినదానిని తలంపను. ఇద్దరున్నచోట నేను నిలువను. ఇట్లు చేసినచో మూర్ఖుడ నెట్లగుదును ?

187 వెకిలితనము

బాలసఖిత్వ మకారణ హాస్యం
స్త్రీషు వివాద మసజ్జనసేవా ।
గర్దభయాన మసంస్కృతవాణీ
షట్సు నరో లఘుతా ముపయాతి॥

బాలురతో స్నేహము, కారణము లేక నవ్వుట, స్త్రీల గురించి వివాదము, దుర్జనుల సేవ, గాడిదను స్వారి చేయుట, సంస్కారములేని మాటల నుపయోగించుట - యీ యారింటి వలన నరుడు చులకన యగును.

188 నిరర్థకం

ధనేన కిం యో నదదాతి యాచకే
బలేన కిం యశ్చ రిపుం న బాధతే ।
శ్రుతేన కిం యో నచ ధర్మమాచరే
త్కి మాత్మనా యో న జితేంద్రియో భవేత్॥

యాచకుల కివ్వని ధనము వలన ప్రయోజన మేమి?
శత్రువులను బాధింపని బలము వలన ప్రయోజన మేమి?
ధర్మము నాచరింప నప్పుడు విద్య వలన ప్రయోజన మేమి?
జితేంద్రియుడు కాని వానికి ఆత్మ వలన ప్రయోజన మేమి?

189 సతీత్వము

సతీమపి జ్ఞాతి కులైక సంశ్రయాం
జనోఽన్యథా భర్తృమతీం విశంకతే।
అతః సమీపే పరిణేతు రిష్యతే
ప్రియాఽప్రియావా ప్రమదా స్వబంధుభిః॥

వివాహిత యైన స్త్రీ పతివ్రత యైనను, పుట్టింట నున్నచో జనులు శంకింతురు. అందుచేతనే స్త్రీ భర్తకు ప్రియురాలైనను కాక పోయినను, భర్తవద్ద నుండవలె ననియే ఆమె బంధువులు కోరుచుందురు.

190 మిత్రుడు

మనీషిణః సంతి న తే హితైషిణో
హితైషిణః సంతి న తే మనీషిణః।
సుహృచ్చ విద్వానపి దుర్లభో నృణాం
యథౌషధం స్వాదు హితం చ దుర్లభమ్॥

పండితులు హితమును కోరువారు కారు. హితమును కోరువారు పండితులు కారు. మనుష్యులలో పండితుడును హితమును కోరువాడును నగువాడు అరుదు. ఎట్లనిన హితకరమైనదియు తీయనిదియు నగు ఔషధము అరుదు.

191 మంచిపని

సుజీర్ణమన్నం సువిచక్షణః సుతః
సుశాసితా స్త్రీ నృపతిః సుసేవితః ।
సుచింత్య చోక్తం సువిచార్య యత్కృతం
సుదీర్ఘకాలేఽపి న యాతి విక్రియామ్ ॥

బాగుగా జీర్ణించిన యన్నము, పండితుడైన కుమారుడు, లెస్సగా శిక్షణ పొందిన స్త్రీ, బాగుగా సేవింప బడిన రాజు, బాగుగా ఆలోచించి పలికిన పలుకు, బాగుగా విచారించి చేసినపని - యివి యన్నియును చాలా కాలమైనను మార్పును పొందవు.

192 కోపము

నిమిత్తముద్దిశ్య హి యః ప్రకుప్యతి
ధ్రువం స తస్యాపగమే ప్రసీదతి ।
అకారణద్వేషి మనస్తు యస్య వై
కథం జనస్తం పరితోషయిష్యతి ॥

కారణము నుద్దేశించి కోపగించిన వాడు, తప్పక ఆకారణము పోగానే ప్రసన్నుడగును. అకారణముగా ద్వేషించు మనస్సు కల వానిని జనులెట్లు సంతోషపెట్టగలరు?

193 న్యాయము

న సాహసైకాన్తరసానువర్తినా
న చాప్యపాయోపహతాన్తరాత్మనా ।
విభూతయః శక్య మవాప్తుమూర్జితా
నయే చ శౌర్యే చ వసంతి సంపదః ॥

కేవలము సాహసమునం దాసక్తి కలవానికి గాని అపాయములను పొందువానికి గాని గొప్ప యైశ్వర్యము పొందుటకు శక్యముకాదు. న్యాయము నందును శౌర్యము నందును సంపదలు వసించును.

194 అన్యాయము

ముదం విషాదః శరదం హిమాగమ
స్తమో వివస్వాన్సుకృతం కృతఘ్నతా ।
ప్రియోపపత్తిః శుచమాపదం నయః
శ్రియః సమృద్ధాఅపి హన్తి దుర్నయః ॥

విచారము సంతోషమును, హేమంతము శరత్కాలమును, సూర్యుడు చీకటిని, కృతఘ్నత్వము పుణ్యమును, ప్రియసమాగమము విచారమును, న్యాయము ఆపదను, అవినీతి సమృద్ధమైన యైశ్వర్యమును నశింపజేయును.

195 బుద్ధి కుశలత

ఉదీరితోఽర్థః పశునాపి గృహ్యతే
హయాశ్చ నాగాశ్చ వహన్తి చోదితాః ।
అనుక్తమప్యూహతి పండితో జనః
పరేంగితజ్ఞాన ఫలాహి బుద్ధయః ॥

పశువు గూడ చెప్పిన విషయమును గ్రహించును. గుఱ్ఱములును, ఏనుగులును గూడ తోలినప్పుడు నడచును. పండితుడైనవాడు చెప్పని దానిని గూడ నూహించును. పరుల యింగితములను తెలిసి కొనుటయే కదా బుద్ధికి ఫలము.

### 196 ఐశ్వర్యనాశ హేతువులు

అసత్యతా నిష్ఠురతా కృతఘ్నతా
భయం ప్రమాదోఽలసతా విషాదితా ।
వృథాభిమానో హ్యతిదీర్ఘసూత్రతా
తథాఙ్గరాత్ర్యాది వినాశనం శ్రియః ॥

అసత్యత్వము, నిష్ఠురత, కృతజ్ఞత లేక పోవుట, భయము, ప్రమాదము, సోమరితనము, విచారము కలిగి యుండుట, వ్యర్థమైన అభిమానము, ఆలస్యము, మందకొడి తనము మొదలగు గుణములు ఐశ్వర్యమును నశింపజేయును.

### 197 గుణపరీక్ష

యథా చతుర్భిః కనకం పరీక్ష్యతే
నిఘర్షణచ్ఛేదనతాపతాడనైః ।
తథా చతుర్భిః పురుషః పరీక్ష్యతే
శ్రుతేన శీలేన కులేన కర్మణా ॥

గీయుట, తెగగొట్టుట, కాల్చుట, సాగగొట్టుట అను నాల్గింటిచే బంగారమెట్లు పరీక్షింపబడునో అట్లే విద్య, శీలము, కులము, కర్మ అను నాల్గింటిచే పురుషుడు పరీక్షింప బడును.

### 198 శరీర రక్షణము

మాతాసమం నాస్తి శరీరపోషణం
చింతాసమం నాస్తి శరీర శోషణమ్ ।
భార్యాసమం నాస్తి శరీరతోషణం
విద్యాసమం నాస్తి శరీర భూషణమ్ ॥

తల్లితో సమానమైన శరీర పోషణము లేదు. చింతతో సమానమైన శరీర శోషణము (నీరసింప జేయునది) లేదు. భార్యతో సమానమైన శరీర తోషణము (సంతోషింప జేయునది) లేదు. విద్యతో సమానమైన శరీర భూషణము లేదు.

199 ధార్మికుడు

స దీక్షితో యః సకలం సదీక్షతే
స పండితో యః కరుణై రఖండితః
స తాపసో యః పరతాపకర్షణః
స ధార్మికో యః పరమర్మ న స్పృశేత్॥

సకలమును లెస్సగా జూచువాడే దీక్షితుడు. కరుణతో నిండిన వాడే పండితుడు. పరుల తాపమును పోగొట్టువాడే తాపసుడు. పరులను బాధించనివాడే ధార్మికుడు.

200 బుద్ధి

మతిరేవ బలాద్గరీయసీ
యదభావే కరిణా మియం దశా ।
ఇతి ఘోషయతీవ డిండిమః
కరిణో హస్తిపకాహతః క్వణన్॥

బలము కంటె బుద్ధియే గొప్పది. బుద్ధిలేక పోవుట చేతనే యేనుగుల కీదశ పట్టినది - అని మావటి వానిచే మోగించబడుచున్న యేనుగమీది ఢక్క ఘోషించుచున్నట్లున్నది.

### 201 అభిమానము

జరారూపం హరతి హి ధైర్యమాశా
మృత్యుః ప్రాణా న్ధర్మచర్యా మసూయా।
కామో హ్రియం వృత్త మనార్యసేవా
క్రోధః శ్రియం సర్వమేవాభిమానః॥

ముసలితనము రూపమును హరించును. ఆశ ధైర్యమును హరించును. మృత్యువు ప్రాణములను హరించును. అసూయ ధర్మమును హరించును. కామము సిగ్గును హరించును. దుర్జన సేవ ప్రవర్తనను హరించును. కోపము ఐశ్వర్యమును హరించును. అభిమానము అంతటిని హరించును.

### 202 వివేకము

సహసా విదధీత న క్రియా
మవివేకః పరమాపదాం పదమ్
వృణతే హి విమృశ్యకారిణం
గుణలుబ్ధాః స్వయమేవ సంపదః॥

ఏపనిని తొందరగా జేయరాదు. అవివేకము అన్ని ఆపదలకు స్థానము. గుణముల యందు ఆసక్తిగల సంపదలు విమర్శించి పనిని చేయువానిని స్వయముగానే వరించును.

### 203 నాశహేతువులు

స్తబ్ధస్య నశ్యతి యశో విషమస్య మైత్రీ
నష్టక్రియస్య కుల మర్థపరస్య ధర్మః।
విద్యాఫలం వ్యసనినః కృపణస్య సౌఖ్యం
రాజ్యం ప్రమత్తసచివస్య నరాధిపస్య॥

బుద్ధిహీనునికి యశస్సున్ను, దుర్మార్గునికి స్నేహమున్ను, కర్మభ్రష్టునకు కులమున్ను, ధనాశకలవానికి ధర్మమున్ను, దురభ్యాసములు కలవానికి విద్యాఫలమున్ను, లోభికి సౌఖ్యమున్ను, గర్వించినమంత్రిగలరాజునకు రాజ్యమున్ను నశించును.

204 ప్రజ్ఞ

శస్త్రైర్హతాస్తు రిపవో న హతా భవన్తి
ప్రజ్ఞాహతాశ్చ నితరాం సుహతా భవన్తి ।
శస్త్రం నిహన్తి పురుషస్య శరీరమేకం
ప్రజ్ఞా కులం చ విభవం చ యశశ్చ హన్తి ॥

ఆయుధములచే చంపబడిన శత్రువులు నిజముగా చంపబడినవారు కారు. ప్రజ్ఞచే జయింపబడినవారే బాగుగా చంపబడిన వారగుదురు. ఆయుధములు పురుషుని శరీరమును మాత్రమే చంపును. ప్రజ్ఞ కులమును, ఐశ్వర్యమును, కీర్తిని కూడ చంపును.

205 పునర్జన్మ

దేహినోఽస్మిన్యథా దేహే కౌమారం యౌవనం జరా ।
తథా దేహాన్తరప్రాప్తి ర్ధీరస్తత్ర న ముహ్యతి ॥

జీవునకీశరీరమున బాల్యము, యౌవనము, ముదిమియు నెట్లు క్రమముగా వచ్చునో, అట్లే మరియొక శరీరమును బొందుటయు గలుగుచున్నది. జ్ఞాని యీ విషయమున మోహము నొందడు.

### 206 మరణము

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ ॥

మనుష్యుడెట్లు జీర్ణములైన వస్త్రములను విడిచి క్రొత్త వస్త్రములను స్వీకరించుచున్నాడో అట్లే జీవుడు శిథిలములైన దేహములను విడిచి క్రొత్త శరీరములను బొందుచున్నాడు.

### 207 మరణము

జాతస్య హి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మ మృతస్య చ ।
తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి ॥

పుట్టిన వానికి చావు నిశ్చయము. చచ్చిన వానికి పుట్టుకయు నిశ్చయమే. కాబట్టి తప్పింప శక్యముకాని విషయమున నీవు దుఃఖించుటకు తగవు.

### 208 ఫలాపేక్ష

కర్మణ్యేవాధికార స్తే మా ఫలేషు కదాచన ।
మా కర్మఫలహేతు ర్భూర్మా తే సంగోఽ స్త్వకర్మణి ॥

నీకు కర్మనుచేయుట యందే అధికారము కలదు. ఒకప్పుడును కర్మఫలములయందు అపేక్ష పెట్టుకొనకుము. ఫలము కొరకు కర్మను జేయువాడవు కాకుము. నీకు కర్మలను జేయకుండుట యందాశ కలుగకుండును గాక.

209 ముని

దుఃఖే ష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః ।
వీతరాగ భయక్రోధః స్థితధీ ర్మునిరుచ్యతే ॥

దుఃఖముల యందు క్షోభమును పొందని మనస్సు కలవాడును, సుఖములయం దాశలేనివాడును, ప్రీతి, భయము, కోపము లేనివాడును నగు మనఃశీలుడు నిశ్చలబుద్ధికల జ్ఞాని యని చెప్పబడుచున్నాడు.

210 నియతకర్మ

నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః ।
శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః ॥

నీవు నీకు నియమింపబడిన కర్మను చేయుము. కర్మము చేయకపోవుట కంటె కర్మము చేయుట శ్రేష్ఠము కదా. కర్మము చేయకుండినట్టి నీకు దేహస్థితికూడ సిద్ధింపక పోవచ్చును.

211 స్వధర్మము

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః

చక్కగా నాచరింపబడిన పరుల ధర్మము కంటె విగుణమైన స్వధర్మము శ్రేష్ఠమైనది. స్వధర్మము నాచరించుటలో మరణమైనను శ్రేయము. పరధర్మము భయమును కలుగజేయును.

212 భక్తి

యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్ ।
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః॥

ఎవ్వరే ప్రకారముగా న న్నుపాసించు చున్నారో వారల నట్లే నేను అనుగ్రహించు చున్నాను. మనుష్యులు నామార్గమును సర్వప్రకారములచే ననుసరించు చున్నారు.

213 మనోనిగ్రహము

అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్ ।
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే॥

మనస్సు నిగ్రహించుటకు అసాధ్యమైనదియు, చంచల స్వభావము కలదియు ననుటలో సందేహము లేదు. కాని, అభ్యాసముచేతను, వైరాగ్యము చేతను నరికట్టబడు చున్నది.

214 సారూప్యము

యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కలేబరమ్ ।
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః॥

ఎవడు మరణకాలమందు నేయే రూపమును దలంచు చున్నవాడై శరీరమును విడుచుచున్నాడో వాడెల్లప్పుడు నాయా రూపము యొక్క స్మరణచే గలిగిన సంస్కారము కలవాడై యాయా స్వరూపమునే పొందుచున్నాడు.

215 సారూప్యము

అంతకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కలేబరమ్ ।
యః ప్రయాతి స మద్భావం యాతి నా స్త్యత్ర సంశయః॥

ఎవడు మరణకాలమందు నన్నే స్మరించుచు శరీరమును విడిచి వెడలుచున్నాడో వాడు నాస్వరూపమును బొందుచున్నాడు. ఈ విషయమున సందేహము లేదు.

## 216 భక్తి నిష్ఠ

తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్యచ
మయ్యర్పిత మనోబుద్ధి ర్మామే వైష్య స్యసంశయమ్॥

అందుచే సర్వకాలముల యందును నన్ను చింతింపుచుండుము. నాయందు బుద్ధిని కలవాడవై నన్నే పొందగలవు. సందేహము లేదు.

## 217 ఉపాసనము

అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥

నన్నే భజించువారై యేజనులు నన్నే చింతించుచు ధ్యానము చేయుచున్నారో-యెల్లప్పుడు నిష్ఠగల వారియొక్క-యోగక్షేమములను నేను నిర్వహించు చున్నాను.

## 218 భక్తి

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి।
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః॥

ఎవడు నాకొరకు ఆకునో, పువ్వునో, పండునో, ఉదకమునో భక్తితో నిచ్చుచున్నాడో అట్టి శుద్ధాంతఃకరణముగల వానిచే భక్తిపూర్వకముగా సమర్పింపబడిన దానిని నేను స్వీకరించుచున్నాను.

219 భక్తి

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।
యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్ ॥

దేనిని చేయుచున్నావో, దేనిని భుజించుచున్నావో, దేనిని హోమము చేయుచున్నావో, దేనిని దానము చేయుచున్నావో, యే తపస్సును జేయుచున్నావో దానిని నా కర్పణము చేయుము.

220 ఉత్తములు

మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే ।
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః ॥

ఈశ్వరార్పణముగా కర్మలను చేయు వారును, ఉత్కృష్టమైన శ్రద్ధతో గూడినవారై నాయందు మనస్సును నిలిపి నన్నుపాసించువారును, శ్రేష్ఠులని నా యభిప్రాయము.

221 ఈశ్వరుడు

ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ।
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ॥

యంత్రము నధిష్ఠించి యున్నవాని వలె సర్వభూతములను తనశక్తిచేత బ్రవర్తింపజేయుచున్న ఈశ్వరుడు సమస్త భూతములయొక్క హృదయ ప్రదేశమందు నున్నాడు.

222 శరణాగతి

తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత ।
తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥

సమస్తవిధములచేతను అతనినే రక్షకునిగా బొందుము. అతని ప్రసాదమువలన ఉత్తమమైన శాంతిని, నిత్యమైన మోక్షమును పొందగలవు.

223 ధ్యాననిష్ఠ

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే ॥

నాయందు మనస్సు కలవాడవును, నాయందు భక్తి కలవాడవును నన్నారాధించు వాడవును నగుము. నాకే నమస్కరింపుము. నన్నే పొందగలవు. నాకు ఇష్టుడ వగుదువు. నీకొరకు యథార్థముగా ప్రతిజ్ఞ చేయుచున్నాను.

224 శరణాగతి

సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః॥

సమస్త ధర్మములను (అనగా కర్మలను) విడిచి ఒక్క నన్నే శరణమును పొందుము. నేను నిన్ను సమస్త పాపముల నుండి విడిపించెదను. దుఃఖింపకుము.

225 శారీరక తపస్సు

దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచ మార్జవమ్ ।
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే ॥

దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, జ్ఞానులను పూజించుటయు, శరీరపారిశుద్ధ్యము కలిగి యుండుటయు, ఋజుత్వమును, బ్రహ్మచర్యమును, అహింసయు శరీరముచే జేయదగిన తపస్సులని చెప్పబడుచున్నవి.

## 226 వాచిక తపస్సు

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే॥

ప్రాణులకు దుఃఖమును గలుగజేయనిదియు, యథార్థమైనదియు, ప్రియముకొరకు హితమైనదియు నగు వచనమును, వేదాధ్యయనమును, వాక్కుచేత చేయదగిన తపస్సులని చెప్పబడుచున్నవి.

## 227 మానసిక తపస్సు

మనః ప్రసాదః సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః ।
భావసంశుద్ధిరిత్యేత త్తపో మానస ముచ్యతే॥

మనస్సును స్వచ్ఛముగా నుంచుటయు, సౌమ్యముగా నుండుటయు, మాట్లాడకుండుటయు, ఆత్మనిగ్రహమును, తలంపునందు శుద్ధముగా నుండుటయు, మనస్సుచే చేయదగిన తపస్సులని చెప్పబడుచున్నవి.

## 218 దేవాంశ

అభయం సత్త్వ సంశుద్ధి ర్జ్ఞాన యోగవ్యవస్థితిః।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్॥
అహింసా సత్యమక్రోధస్త్యాగః శాన్తిరపైశునమ్ ।
దయాభూతేష్వలోలత్వం మార్దవం హ్రీ రచాపలమ్ ।
తేజః క్షమా ధృతిః శౌచ మద్రోహో నాతిమానితా ।
భవన్తి సంపదం దైవీ మభిజాతస్య భారత॥

భయము లేకుండుటయు, స్వభావశుద్ధియు, జ్ఞాన యోగనిష్ఠయు, దానమును, ఇంద్రియ నిగ్రహమును, యజ్ఞములు చేయుటయు, వేదాధ్యయనమును, తపస్సుచేయుటయు, ఋజుత్వమును, అహింసయు, సత్యము చెప్పుటయు, కోపము లేకుండుటయు, అహంకారాదులను విడచుటయు, చిత్తశాంతి కలిగి యుండుటయు, ఇతరుల దోషములను ప్రకటన చేయకుండుటయు, ప్రాణులయందు కనికరము, ఇంద్రియ వికారము లేకుండుటయు, మృదుత్వమును, సిగ్గును, చాపలము లేకుండుటయు; ప్రాగల్భ్యమును, ఓరిమియు, ధైర్యమును, చిత్తశుద్ధియు, పరులను బాధింపకుండుటయు, గర్వము లేకపోవుటయు – అను నీలక్షణములు దేవతలు పొందదగిన వైభవమును పొందదగి పుట్టినవారికి గలుగుచున్నవి.

# తప్పొప్పుల పట్టిక

| పేజీ | శ్లోకము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 12 | 12 | అనభిద్యా | అనభిధ్యా |
| 16 | 26 | అన్నం | అన్న |
| 21 | 43 | అధసస్య | అధనస్య |
| 25 | 55 | తథాపిసు | తథాపి |
| ,, | ,, | విచార్యైవ | సువిచార్యైవ |
| 33 | 85 | తానన్మహాత్వం | తావన్మహాత్వం |
| 34 | 87 | పాప్తే | ప్రాప్తే |
| 34 | 88 | తప్తోరక్షే | త్తపోరక్షే |
| 35 | 90 | అహింసా | అహింస |
| 35 | 93 | అచరేత్ | ఆచరేత్ |
| 41 | 113 | వారిజేన్నైవ | వారిజేనేవ |
| 43 | 118 | స్వాల్ప | స్వాల్ప |
| 43 | 120 | వావ్యశుభం | వాప్యశుభం |
| 44 | 122 | స్తుత్వా | స్తుత్యా |
| 47 | 133 | శృణోతి | శృణోతి |
| 58 | 165 | మభస్త | మభ్యస్త |
| 58 | 166 | స్వచేషి | స్వచేష్టి |
| 60 | 169 | సముద్రే | సముద్రే |